APPROVED BY THE GOVERNMENT TEXT-BOOK COMMITTEE.
FORT ST GEORGE GAZETTE, PAGE 565 OF 21-10-1913.

# ELEMENTARY PHYSICS

*(Adapted for use in Forms* I, II & III *and written in accordance with the Syllabus prescribed for Training Schools.)*

BY

M. SAMBASIVA RAO. B. A., L. T.,
LECTURER, NOBLE COLLEGE

WITH A FOREWORD BY

THE REV. W. C. PENN. M. A., F. M. U.,

PRINCIPAL, NOBLE COLLEGE

Madras
PRINTED AT THE "JYOTISHMATI" PRESS.
1914

విజ్ఞానచంద్రికా గ్రంథమాల ౬.

# పదార్థవిజ్ఞానశాస్త్రము

(ప్రాథమిక పాఠశాలలో 1, 2, 3, ఫారములకును ట్రైనింగుస్కూళ్లకును
ఉపయోగించులాగున వ్రాయబడినది)

ఇది
మంత్రిప్రగడ సాంబశివరావు, బి.ఏ., ఎల్.టి.
గారిచే రచింపబడినది.

రెండవకూర్పు

చెన్నపట్టణము
"జ్యోతిష్మతీ" ముద్రాక్షరశాల
౧౯౧౮

 [వెల ౦-౧౨-౦

Inscribed
To the Memory of one
whom I loved extremely
and still love, though
Separated by
The Bounds of
Eternity.

M. Rao.

# Foreword



A common tendency of Indian students is to acquire knowledge without assimilating and correlating it to the ordinary facts of life. This is partly due to the fact that science and other subjects are not taught in the vernaculars of the country. I have heard of mathematical students who had learnt the true origin of eclipses of the sun & how to calculate them, being discovered on the day of an eclipse carefully covering their waterpots in order to keep off the evil influences of the dragon who, according to ancient legend, swallows up the sun on such occasions. This is a concrete instance of what too often happens with regard to our students who learn a thousand useful things in an academical way for examinations, but who fail to apply them to the facts of life.

Science, in the lower forms of every school, should be taught in the vernacular and this little work is an earnest attempt to supply a great need. Of course a great deal depends on the teachers as to whether science is made a real thing to the pupil, but a text book of some sort is necessary. The

translations of names of elements & technical terms by the author are, I suppose, more of the nature of explanations, for when the student continues his studies in the higher forms, it will be necessary for him to know the universally recognised terms.

I have great pleasure in recommending this admirable book to the attention of all Lower Secondary teachers.

MASULIPATAM.
30th April 1914.

WILLIAM. C. PENN.
*Principal, Noble College.*

# PREFACE

It is a significant sign of the times that one who runs may read that all rational educational methods require the teaching of all 'Sciences' in the mother tongue of the pupils in order to secure an intelligent understanding & assimilation of the knowledge imparted. It is an educational common place to say that the difficulty of language should never be a bar for the acquisition of knowledge in the sciences which are the common heritage of all humanity. I need not remind my readers, more particularly the members of the noble profession of which I am a humble follower, of the various & authoritative pronouncements that have been recently made in Press or on the Platform, in the Legislative Council or in the sanctuary of the school room, by people of all grades of social position and educational influence. I need only draw the attention of my readers to the important utterance at Bangalore of the Lord Bishop of Madras whose experience and disinterested work in the field of education for more than a quarter of a century in this country entitles him for the proud position of being our non-official guide in directing the educational destinies of this presidency. Some people, while admitting the rationality of the Principle, that teaching of the sciences should be done in the vernacular of the pupils, urge against its feasibility and immediate adoption by raising the bogey of the absence of books in the vernaculars. It must be conceded to some extent that there are not many

scientific works in the vernaculars; but it must be understood at the same time that books will never be published unless and until the principle admitted above is put into immediate and active operation. The next day after it is put into practice, scores of books will flood the market, and the affair will become a mere matter of 'supply and demand.'

Therefore, it is with a view to lifting off the blame laid on our shoulders thal I make this humble contribution and give to the public the first part, properties of matter, and heat, of my book originally published by the VijnanaChandrika Mandaliof Madras in 1909. I have thoroughly revised thebook and rewritten and added some portions, rendering it useful for adoption in the 'First Three Forms' of the Secondary Schools and in the Training Schools of the Telugu Districts. The apparatus required is simple and is entirely within the necessary equipment of every average Secondary School.

I hope that the teachers concerned will kindly receive the book and use it in their classes. Any suggestions for improvement in the matter or the method of the book will be most thankfully received.

I close this short note by thanking the "Text-Book Committee" for their kind encouragement in approving this as a text book in schools.

NOBLE COLLEGE,
Masulipatam,
27-4-14.

M. Sambasiva Rao.

## రెండవకూర్పు పీఠిక

ఈ పుస్తకమును "పఠనగ్రంథ నిర్ణయ సభవారు" (Text-Book Comittee) ఆమోదించినందున, దీనిని పునర్ముద్రణము చేయించి ఆంధ్ర విద్యార్థిలోకంబున కర్పించుచున్నాను. ఇందు "పదార్థముయొక్క గుణములు" (Properties of matter) అను భాగమును ట్రైనింగు స్కూళ్లకు కావలసిన ఉష్ణము, రసాయనశాస్త్రభాగమును చేర్పబడినది. ప్రతిపాఠశాలయందును 'శాస్త్రపాఠము'లు చిన్నతరగతులకు గూడ బోధింపబడుచున్నవి. అన్ని శాస్త్రములకును పదార్థవిజ్ఞానశాస్త్రము పునాది వంటిది. ఇదిగాక ప్రస్తుతము మన పాఠశాలలయందు నీవిషయమును బోధించుటకు గల సౌకర్యములు తక్కిన శాస్త్రములపట్ల నంతగా లేవు. అట్టి యభిప్రాయముతో దీనిని మొదట్టి మూడు ఫారములయందును పఠనీయ గ్రంథముగా నుపయోగించునట్లు వ్రాసియుంటిని. అట్లు చేసినయెడల కలుగు లాభము అపారము. ఏలయన బాలురు నాలుగు, అయిదు, ఆరు ఫారములయందు నేర్చు విషయముల కిది మంచిపునాదియై బాలురయొక్కయు, యుపాధ్యాయులయొక్కయు, కష్టమును చాలవరకు తొలగించును. ఈ గ్రంథము "ప్రాథమికపాఠశాలల" లోని యుపాధ్యాయులకును బాలురకును గూడ నుపయోగము.

ఇందు బాలురచే జేయింపవలసిన ప్రయోగము లనే కములు చేర్చి, వానిని యుపాధ్యాయులు జాగ్రత్తబెట్టవలసిన మార్గములను గూడ సూచించితిని. ఆప్రయోగములను బాలురచే జేయించిన యెడల వారికి "ప్రదర్శనశాలా శిక్ష" (Laboratory Training) అలవడుననుటకు సందేహము లేదు. కాబట్టి ఉపాధ్యాయులు అందరును ఈ గ్రంథమును మన్నించి దానివలన గలుగు లాభములను బాలురకు కలిగించి, ఏమైన లోపము లున్నయెడల నాకు తెలియజేయుదు రని వేడుచున్నాను.

ఈగ్రంథమునందు అనేక మార్పులను చేసి, చాల క్రొత్తపటములను చేర్చియున్నాను. నాకీశాస్త్రమును బోధించుటయందు గల యనుభవమునంతను సాధ్యమగునంతవరకు నిండు శక్తివంచనలేక ప్రయోగించితిని. శాస్త్రవేత్తయగు న్యూటను యొక్క చిత్రపటమును క్రొత్తగా చేర్చియున్నాను.

ఈ కూర్పును ప్రచురించుటయందు నాకెంతయో సాయ పడినట్టి విజ్ఞానచంద్రికా మండలికిని, అందు ముఖ్యముగా నా యాప్తమిత్రులు లక్ష్మణరావు, లక్ష్మీపతి పంతులు గార్లకు నా వందనశతంబుల నాచరించుచున్నాను.

సుజనవిధేయుడు

మం-సాంబశివరావు

# విషయసూచిక

## మొదటి అధ్యాయము

## (CHAPTER I.)



## రెండవ అధ్యాయము.

## (CHAPTER II.)

## మూడవ అధ్యాయము.

## (CHAPTER III.)



## నాల్గవ అధ్యాయము.

## (CHAPTER IV.)



## అయిదవ అధ్యాయము.

## (CHAPTER V.)

## ఆరవ అధ్యాయము.

## (CHAPTER VI.)



## ఏడవ అధ్యాయము.

## (CHAPTER VII.)



## ఎనిమిదవ అధ్యాయము.

## (CHAPTER VIII.)

## తొమ్మిదవ అధ్యాయము.

## (CHAPTER IX.)



## పదియవ అధ్యాయము.

## (CHAPTER X.)

## పదునొకండవ అధ్యాయము.

## (CHAPTER XI)

# పంండ్రెండవ యధ్యాయము

# (CHAPTER XII)



# అనుబంధము.

# పదార్థవిజ్ఞానశాస్త్రము

## మొదటి యధ్యాయము

మనుష్యుడు గర్భకుహరమునుండి విముక్తిజెంది ఈప్రపంచకమున బుట్టినదిమొదలు వాని ఇంద్రియములు భూతసంఘట్టనమువలన పనిచేయుటకు ప్రారంభించును. వెల్తురువలన కన్నులుచూచును. శబ్దమును చెవులువినును. వాసనను ముక్కు గ్రహించును. భూతములతో నిండియున్న ఈ ప్రపంచకము భౌతికప్రపంచకము. ఆభూతములను గూర్చి వివరించువిద్యలు భౌతికశాస్త్రములు. ఇవి అనేకములు. ఉదాహరణము: జ్యోతిషశాస్త్రము, శారీరశాస్త్రము, భూగర్భశాస్త్రము, రసాయనశాస్త్రము, పదార్థవిజ్ఞానశాస్త్రము మొదలైనవి. ఈశాస్త్రములవలని జ్ఞానము కర్మేంద్రియగోచరము. కర్మేంద్రియములకు లోనుగాక మనస్సేంద్రియమునకు మాత్రము గోచరించు జ్ఞానము గూడ గలదు. అట్టి శాస్త్రములు మానసిక (ఆధ్యాత్మిక) శాస్త్రములు. కాబట్టి "శాస్త్రము" యొక్క కొన్ని

భాగము లీక్రింది పట్టికవలన తెలియనగును.




మనప్రస్తుతవిషయము పదార్థవిజ్ఞానశాస్త్రము.

పదార్థ మన నేమి ?

ఈప్రపంచకములో నెటుచూచినను అనేకములైనవస్తువులు కనబడుచున్నవి. కొండ, సముద్రము, సూర్యుడు, గాలి, కుర్చీ మొదలయినవాని నన్నిటిని మనము పదార్థములు అని చెప్పుచున్నాము. ఇప్పుడు పేర్కొన్న వస్తువు లన్నియు విజాతీయములే కాని సజాతీయములు కావు. అట్లయిన వీని నన్నిటిని మనము ఒక్కపేరుతో పిల్చుట యెట్లు తటస్థించుచున్నది? ఒక్కపేరుతో పిలువబడు వస్తువుల కన్నిటికి నేదియైన నొక్క సాధారణధర్మమయినను ఉండవలయును గదా? కావున ఈ వస్తువుల కన్నిటికిగల సాధారణధర్మములను కనుగొందము. ఈ వస్తువుల కన్నిటికిని జడత్వము (Inertia) అను నొక ముఖ్యమైన సాధారణధర్మముగలదు. కావుననే వీనిని జడములు లేక జడపదార్థము లనియెదరు. అనగా తమంతటతాము కదలలేక

పోవును. ఈపదార్థము లన్నియు ఆకాశము (అవకాశము (Space)లో కొంతస్థలమును ఆక్రమించుకొనును. ఒకపదార్థ మున్నస్థలములో ఏకకాలమందు మరియొకపదార్థ ముండుటకు వీలులేదు. కాబట్టి వీటికి "వ్యైశాల్యము" అనగా స్థలము నాక్ర మించు గుణముగూడ గలదని చెప్పవచ్చును. ప్రతిపదార్థమున కును కొద్దిగానొ గొప్పగానొ 'బరువు'కలదు.మనము పీల్చుగాలికి కూడబరువు గలదు. కాబట్టి 'బరువు' లేక 'భారము' గూడ నొక ముఖ్యమైన గుణమని యెంచవచ్చును. ఈ పదార్థములకన్నిటి కిని ఇంక ననేకసాధారణధర్మములు కలవు. వాని నన్నిటిని రెం డవ ప్రకరణములో వివరముగా గ్రహించవచ్చును. ప్రస్తుతము సూచనగా ఈసాధారణ ధర్మములు చూపబడినవి. చదువరులు 'స్థలము నాక్రమించునదియు బరువు కలదియు, తనంతట తాను కదలలేనిదియు 'పదార్థము' (Matter) అని జ్ఞాపకముంచు కొనవల్రయును.

## శక్తి (Force)

మనము సాధారణముగా చూచుచుండు పదార్థము లన్నియు జడములవలె పడి యుండక కొన్నిసమయములయందు కద లుట, మరి కొన్నిసమయములయందు ఆకారమునందు మార్పు చెందుట మనకు తెలిసిన విషయమే. ఉదాహరణము: రైలు బండి. పరుగెత్తుచు కావలసినప్పుడు ఆగుచుండును; కుమ్మరవాడు మంటితో కుండలు మొదలైన అనేక స్వరూపములు చేయు

చున్నాడు; నీరు కాచిన ఆవిరియగుచున్నది. రైలు పరుగెత్తుటకు కారణము ఆవిరి; మంటినుండి కుండలువచ్చుటకు కారణము కుమ్మరవాని యుపాయము; నీరు ఆవిరిగా మారుటకు కారణము వేడిమి. ఈ మూడును లేక పోయిన ఆ వస్తువులు మొదటి స్థితిలోనే యుండును గదా! కాబట్టి పదార్థములయందు స్థితిభేదమును కలిగించునట్టి దొకటి యుండవలెను. దానికే శక్తియని పేరు.

పదార్థములయందు స్థితిభేదమును గలిగించునది శక్తి. శక్తులు అనేకములు. ఆయాశక్తులనుగూర్చి చెప్పునట్టి శాస్త్రమే పదార్థవిజ్ఞానశాస్త్రము. ఇందు వివరింపబడు శక్తులన్నియు పదార్థముయొక్క రచననుమార్చక, స్థితినిమాత్రము మార్చును.

## భౌతికమార్పులు, రాసాయనిక మార్పులు

## PHYSICAL AND CHEMICAL CHANGES.

'పదార్థముయొక్క స్వత్వమును చెరుపనట్టిమార్పులు' ఈపదార్థవిజ్ఞాన శాస్త్రముయొక్క విషయము లని పైనిచెప్పబడినది. ఆమాటల కర్థము కొంచెము వివరముగా వ్రాసినగాని చదువరులకు తెలియనేరదు. సృష్టిలోని శక్తులు పదార్థములలో అనేక విధములయిన మార్పులు కలిగించును. అందు కొన్ని మార్పులవలన ఆపదార్థముయొక్క స్వరూపము పోయి స్వత్వము వినాశము చెంది యాపదార్థము వేరు పదార్థముగా మారును. అనగా దానికి సంపూర్ణ స్వత్వనాశనము సంభ

వించును. కొన్ని మార్పులవలన పదార్థమునకు గొన్ని క్రొత్త గుణము లబ్బునేగాని అది స్వరూపనాశమును గాని లేక రచన యందు మార్పుగాని చెందదు. ఇందుకు కొన్ని యుదాహరణముల నిచ్చినగాని యీవిషయము చదువరులకు చక్కగబోధపడనేరదు.

1. తడిసున్నము పసుపు కలిపినయెడల నవి తమ స్వస్వరూపమును విడిచి వసంత మను ఎర్రనిపదార్థముగా మారుచున్నవి. సున్నమును పోయినది, పసుపును పోయినది. రెండును కలిసి మూడవపదార్థమైనది. ఇదిగాక ఈ రెండును కలియునప్పుడు వేడిమి పుట్టును.

2. పాలు తెచ్చి అందు రాత్రి కొంచెము చల్ల పోసి తోడుపెట్టిన యెడల తెల్లవారుసరికి పాలస్వత్వము మారి పెరుగు అగుచున్నది. ఇందుగూడ నూతనపదార్థ మొకటి యేర్పడినది.

3. మనము ప్రతిదినమును ఆహారమును భుజించుచున్నాము. అది మనగర్భమందు జరుగుక్రియవలన స్వస్వరూపమును పోగొట్టుకొని మన శరీరమునకు ఆవశ్యకమైన రక్తముగ మారుచున్నది. ఇదియు పై మార్పులవంటిదే.

4. ఇంగిలీకమును పొడిచేసి గిన్నెలో నుంచి, గిన్నెను వెచ్చచేసినయెడల నది పాదరసముగను ఒకవాయువుగను మారును. వాయువు ఎగిరిపోవును. పాదరసము మాత్రము

గిన్నెలో నుండును. ఇంగిలీకపు ధర్మములును పాదరసపుధర్మములును ఒక్కటి కావని వేరుగ చెప్పవలెనా?

5. చెట్టుమీద కాడ తెగినందున పండు భూమిమీద పడుచున్నది. అనగా, నది భూమిచే నాకర్షింపబడుచున్నది. అందుచే దానికి గొంతచలనము (Motion) కలుగుచున్నది. ఈచలనము అనునది పండున కంతకు పూర్వములేని క్రొత్త ధర్మము. ఈమార్పువలన పండున కీక్రొత్తధర్మ మబ్బినను దానిపూర్వపు ధర్మముల (Properties) నది వదలలేదు. అనగా, దానికి స్వత్వనాశము కలుగలేదు. చెట్టున నున్నప్పుడును భూమిమీద నున్నప్పుడును పండు ఒకలాగే యుండును.

6. ఒకసూదిని అయస్కాంతముతో రుద్దినయెడల దానికి కొంతకాలమువరకు అయస్కాంత గుణము లబ్బుచున్నవి. కాని దాని పూర్వధర్మములుగాని స్వత్వముగాని పోదు.

7. నీరు కాచినయెడల పొంగి దానిలో చలనము పుట్టును. అది ఆవిరిగా మారును. ఆవిరి చల్లబడిన తిరిగి నీరగును.

8. విద్యుచ్ఛక్తివలన ట్రాంబండ్లకు గొప్ప వేగము ప్రాప్తమగుచున్నదేగాని వానికి అంతకు పూర్వము గల ధర్మములు మారుట లేదు.

9. వెన్నను గిన్నెలో వేసి కాచినయెడల నేయి యగును. నేతిని తిరిగి వెన్నగా మార్చలేము.

10. కమ్మరివాడు ఇనుమును కాల్చి ఎఱ్ఱగా జేయును. అది చల్లారిన వెనుక తిరిగి ఇనుముగానే యుండును.

పైని తెలుపబడిన పది యుదాహరణములలో రెండు విధము లయిన మార్పులు కానబడు చున్నవి. కొన్ని ఉదాహరణములు పదార్థముల స్వత్వమును చెరిచిన మార్పులు. కొన్ని ఉదాహరణములు అట్లు పదార్థముయొక్క స్వత్వమును చెరుపక అందు కొంచెము నూతనధర్మములను కల్పించిన మార్పులు. ఈమార్పు సామాన్యమైనది; హెచ్చు మార్పు కాదు. మొదటి జాతి ఉదాహరణములలో స్థిరమైన మార్పులు కలిగి క్రొత్త వస్తువులు పుట్టును. ఈరెండు మార్పులను గురించి చర్చించు శాస్త్రములు రెండు కలవు. అందు మొదటిమార్పునుగురించి, అనగా పదార్థముయొక్క స్వత్వమును మార్చునట్టిమార్పును గురించి చర్చించునది 'రసాయనశాస్త్రము' (Chemistry); రెండవ విధమైనమార్పును గురించి, అనగాపదార్థముయొక్కస్వత్వమును (Constitution) పోగొట్టని మార్పును గురించి, చర్చించునది ప్రస్తుతవిషయ మగు పదార్థ విజ్ఞాన శాస్త్రము.

## పదార్థమునకు వినాశము లేదు

కొన్ని మార్పులు కలిగినప్పుడు పదార్థముల స్వత్వములకు మార్పు కలుగుచున్నదని పైని వ్రాసినందున పదార్థమునకు వినాశము కలదని చదువరులు భ్రమపడుదురేమో? అట్లనుకొన గూడదు. ఆయాపదార్థములు స్వత్వమును విడిచి యన్యపదార్థములుగా 'మారు' నని గ్రహించవలెను. కాని ఆపదార్థము

లోని ద్రవ్యము వినాశము చెందునని కాదు. ఆపదార్థములోని ద్రవ్యము మార్పు బొంది వేరు పదార్థముగా పరిణమించును. అంతే కాని దానికి నాశనము కలుగ లేదు.

ఈ సృష్టియం దున్న యేవస్తువుగాని నాశము చెందదు. మనము వస్తువులు నాశము చెందిన వని యనుకొను ప్రసంగము లన్నియు రూపాంతరములు. వినాశములు కావు. వీధిలో నిప్పుడున్న నీరు కొంతకాలమున కుండదు. అది నాశము చెందెనని మనము చెప్పుదుమా? ఆనీరు ఆవిరిరూపమును చెంది మేఘము మాయెనేకాని నాశము చెందలేదు. కర్ర కాలిపోయినయెడల అది నాశమును చెందెనని మనము తలచెదము. కాని యది బొగ్గులుగను, కర్బనద్వ్యమ్లజిద (Carbon Dioxide) మనుశాస్త్రీయ నామముగల బొగ్గుపులుసు గాలిగను మారెనేగాని నశించిపోలేదు. ఈలాగుననే సృష్టిలోని యత్యంత సూక్ష్మమైన యణువు కూడ నాశము చెంద నేరదు. సత్తునుండి యసత్తు పుట్ట నేర దని మన వేదాంతులు చెప్పెడిమాట కిదియ యర్థము. ఇంతియకాదు. అసత్తునుండియు సత్తు పుట్ట నేర దని మనపూర్వులవలెనే యాధునిక శాస్త్రజ్ఞులును అభిప్రాయ పడెదరు; అనగా, క్రొత్తయణువులు పుట్టవు. ఇదివరకు జగత్తునం దెంత జడపదార్థము గలదో ఆపరిమాణము ఎన్నడును తక్కువయును కాదు, ఎక్కువయును కాదు. సృష్టియందు మనము చూచుచున్న పదార్థముల యుత్పత్తిలయాదులు సృష్టియందలి జడముయొక్క స్వరూపభేదములే కాని, యందు గొంచెమైనను క్రొత్తద్రవ్యము వచ్చిచేరదు; ఉన్నది తగ్గదు.

## 2. శక్తికి వినాశము లేదు

జడమువలెనే శక్తికూడ నాశము జెందునది కాదు. తుపాకిలోనుండి బహువేగముతో బయలుదేరిన గుండు గోడకు దగిలి యాగిపోవును. అంత నా వేగమను శక్తి నశించె నని మన మనుకొందుము. అది నశింపలేదు. ఆగుండు ఆ గోడ కెచ్చట దగిలెనో యచ్చట బట్టిచూచిన యెడల అది వెచ్చగా నుం

డును. ఇట్లు ఆ వేగ మను శక్తి యుష్ణతయను శక్తిగా మారెనేకాని నాశము జెందలేదు. ఇటులనే పొగబండిలోని ఉష్ణతను కొన్ని యుపాయములచే గమనముగ (Locomotion) మార్చెదరు. చెన్నపట్టణములో మన మెక్కి తిరుగు ట్రాంబండ్లలో విద్యుచ్ఛక్తిని గమనముగా మార్చెదరు. మైసూరు ప్రాంతమున కావేరీనది యొకకొండమీదినుండి క్రిందికి దుముకును. ఆ ప్రపాత మనునది (Waterfall) యొకశక్తి. దానిని విద్యుచ్ఛక్తిగా మార్చి దానిచే కోలారునొద్దనున్న బంగారపు గనులను త్రవ్వించుచున్నారు. ఇట్లు సృష్టిలోని యొక శక్తి మరియొక శక్తిగా మారునేగాని నాశము జెందదు.

## పరమాణువాదము

పదార్థములనుగురించి శాస్త్రజ్ఞులు చెప్పు మరియొక సిద్ధాంతము కూడ చదువరులు తెలిసికొనవలయును. ఒక చిన్న కాగితపు ముక్కను తీసికొని రెండుతునకలు చేయుము. అందులో నొకతునకను మరల రెండుగ చీల్చుము. ఆచిన్న తునకలలో నొకదానిని మరల రెండు తునకలు చేయుము. ఈప్రకారము సగము సగము చేయుచుబోయిన గొంతకాలమునకు నవి మిక్కిలి చిన్నవియై వానిని చేతితో చించుటకు వీలులేక పోవును. తరువాత సూక్ష్మదర్శిని యంత్ర సహాయమును శస్త్రముల సహాయమును పొంది వానిని చించుచు బోయిన, కొంతకాలమునకు నాతునుకలు ఇక ఖండించుటకు వీలులేనంత చిన్నవి యగును. ఇట్లు ప్రతిపదార్థమును విభజించుటకు వీలులేనంత చిన్న యణువులయొక్క సమూహము. ఈయణువులు ఆకర్షణశక్తిచే నొకచోట గూడియుండి పదార్థ మగుచున్నవి. కేవల మూహచే తెలిసికొనునంత యత్యంత సూక్ష్మమైన పరమాణువులచే నీయణువులు ఏర్పడె నని శాస్త్రజ్ఞుల సిద్ధాంతము. కణాదఋషికృత వైశేషికదర్శనముయొక్క సిద్ధాంతమును ఇట్టిదియే. అందుచేతనే యాఋషికి 'కణభుక్' 'కణాద' అను నామములు కలిగెను.

ఇట్లు మనము పదార్థవిజ్ఞాన శాస్త్రముయొక్క విషయము మును తెలిసికొని యిక నాశాస్త్రమును అభ్యసింపుదము.

## శాస్త్రాభ్యాస సాధనములు

ఇతర భౌతికశాస్త్రములవలెనే ఈ శాస్త్రమును అభ్యసించుటకుగూడ ప్రత్యక్షానుభవమే ముఖ్యసాధనము. ఇంద్రియజన్యజ్ఞానము ప్రత్యక్షమని చదువరులకు వేరుగ చెప్పనక్కర లేదు. ఈ ప్రత్యక్షానుభవము రెండు విధముల కలుగును. ఒక విధమునకు 'అవలోకనము' (Observation)అనియు, రెండవదానికి ప్రయోగ మనియు నామములు. 'అవలోకనము' నకు 'నిరీక్షణము' 'ప్రేక్షణము' అని నామాంతరములు.

## 1. అవలోకనము

సృష్టిలోని పదార్థములను, వానిగుణధర్మములను, వ్యాపారములను, కార్యకారణ సంబంధములను, సృష్టినేమములను కనుగొను నిమిత్తమై సృష్టిలో జరుగుచున్న నైసర్గికములను మార్పులను (Phenomena) శ్రద్ధతో చూచుట అవలోకన మనబడును. గ్రహణము లెప్పుడు వచ్చునో లెక్కవేయువిధము జ్యోతిష్కు లెట్లు కనుగొనిరి? అవలోకనమువలననే. గ్రహణము లెప్పుడు పట్టునో కనిపెట్టుచు కొన్ని దినములవరకు నవలోకనముచేసి సూర్యగ్రహణము అమావాస్యనాడును చంద్రగ్రహణము పౌర్ణిమనాడును తప్ప ఇతర దినములలో రావని నిశ్చ

యించుకొనిరి. కొన్ని సంవత్సరములవరకు గ్రహణావలోకనము చేయుచు తుదకు గ్రహణచక్రము 18 సంవత్సరముల 11 దినముల 7 గంటల 42 నిమిషము (Minutes)ల కొకసారి తిరుగుచుండునని, అనగా పదునెనిమిది సంవత్సరము లయినతరువాత మరలమరల ఆయాగ్రహణములే వచ్చునని, తెలిసికొనిరి. అందుచే కొన్నిగంటలు హెచ్చుతక్కునగా గ్రహణములు లెక్కవేయుట నెరిగిరి. మరి యనేకసంవత్సరములు గ్రహణఘటికలను గనిపెట్టి నిమిషభేదము గూడ లేకుండ లెక్కవేయుట నేర్చిరి. ఇట్లు జ్యోతిశ్శాస్త్రమంతయు ఆకాశగోళములయొక్క చలనములను వేలకొలది సంవత్సరములవరకు అవలోకించి యవలోకించి అనేకతరములవారిచే సాధింపఁబడినది. జ్యోతిశ్శాస్త్రాభివృద్ధికి అవలోకనమే ముఖ్యాధారము. ఇట్లు అవలోకనమే ఆధారముగా గల శాస్త్రములు అభివృద్ధి యగుటకు విశేష కాలము పట్టును. ఎందు కనగా, మన మవలోకనము చేయవలసిన సృష్టిలోని వ్యాపారము మనకు నిష్టమువచ్చినప్పుడు జరుగదు. అది వచ్చినప్పుడు కనిపెట్టుకొని మనము చూడవలెను. సూర్యునియందలి మచ్చలను గురించి కనుగొనవలెననిన, ఆ మచ్చలు సూర్యునియందు సంవత్సరములో నెప్పుడు కానవచ్చునో యప్పుడు వానిని మనము పరీక్షింపవలసినదే కాని వట్టిసమయములయందు నేమియు జేయ వీలులేదు.

## 2. ప్రయోగము

సృష్టిలోని పదార్థముల గుణధర్మములను గనుగొనుటకు అవలోకనపద్ధతి యంతగా నుపయోగపడదు. మంచుగడ్డలు నీటి కంటె బరువా లేక తేలికయా యని కనుగొన వలసి యున్నది. ఇది కేవల మవలోకనపద్ధతివలననే యెరుంగవలె ననిన, మంచు గడ్డలు కట్టి తరువాత పెద్దవర్షమువచ్చి అందులో నవి కొట్టు కొని పోయినప్పుడు ఆగడ్డలు నీటిలో తేలునా మును గునాయని చూచి కదా మనము నిర్ణయింపవలసినది. నీరు స్వాభావికముగా గడ్డకట్టని యుష్ణదేశములో ఈయోగ మెన్న డును రాదు. కావున అట్టి దేశవాసులకు అవలోకనమార్గ మీ విషయశోధనలో పనికిరాదు. అట్టివారు మరి యన్యవిధ ముల నీటిని మంచుగా మార్చి, యామంచుగడ్డను నీళ్లలో వేసి యది తేలుట జూచి, యది నీళ్లకంటె దేలిక యని నిశ్చ యింపవలెను. ఇట్లు శోధించి చూచుటకు ప్రయోగ మని పేరు. ఇం కొకయుదాహరణమును జూపెదము. విద్యుత్ (Electricity) యొక్క గుణధర్మములను గనుగొన వలసి యున్నది. సృష్టిలో అవలోకనమార్గమున విద్యుత్తును జూడ వలె నన్న వర్షాకాలమునందు ఉరుము మెరుపురూపమునగాని అదికానరాదు. అట్లు వానతో గాలితో గలసి, ఆకాశమునం దెంతయో యెత్తున నున్న విద్యుత్ గుణధర్మముల గాంచుట

యెట్లు? అందుకై శాస్త్రజ్ఞులు ఈభూమిమీదనే విద్యుత్తును పుట్టించు నుపాయములు చూడసాగిరి. పదార్థముల రాపిడి వలన మిరుమిట్లు కలుగు నని చూచి యనేక పదార్థములను ఒకటితో నొకటి రాచి శోధించిరి. శోధింపగా శోధింపగా అద్దము, పట్టు, ఈరెంటి రాపిడివలన నిచ్చట విద్యుత్తును పుట్టింపవచ్చును అని ప్రత్యక్షానుభవమువలన గనిపెట్టిరి. ఈ చేసిన శోధనల కన్నిటికిని ప్రయోగము లనిపేరు. ఇట్లుభూమిమీదనే విద్యుత్తును బుట్టించి, అందుతో ననేకప్రయోగములు (Experiments) ప్రయోగశాల (Laboratory) లో జేసి, ధన విద్యుత్ (Positive Electricity), ఋణవిద్యుత్ (Negative Electricity) అను రెండు విద్యుత్తులు కలవనియు, అందు నేకజాతి విద్యుత్తులకు పరస్పరవైరమును, భిన్నజాతులకు పరస్పరస్నేహమును గల దనియు, భిన్నజాతుల మిశ్రణమే పిడుగనియు, మొదలయిన యనేకాంశముల గనుగొని యావిద్యుత్తును తమ దానిసగా జేసికొని దానిచే బండ్లులాగించుకొనుచున్నారు; విసనకఱ్ఱలు వీవించుకొనుచున్నారు; దీపములు వెలిగించుకొనుచున్నారు; పిండి విసరించుకొనుచున్నారు!!!

---

# రెండవ యధ్యాయము

## పదార్థముల ధర్మములు

## PROPERTIES OF MATTER.

మొదటి అధ్యాయములో పదార్థముయొక్క సామాన్య లక్షణము చెప్పియుంటిమి. ఇప్పుడు పదార్థముల ధర్మములను గురించి కొంచెము వివరముగా విచారించెదము. క్రింద వర్ణింపఁబోవు ధర్మములు సకలపదార్థములకు సామాన్యమైనను కొన్నిఁటిలో కొన్నిధర్మము లధికముగా నుండును. కొన్నిటిలో కొద్దిగా గానవచ్చును. మరికొన్నిటిలో నామమాత్రముగా నుండును. ఇక పదార్థధర్మములు వివరించెదము.

1. పరిమేయత (Extension).—ఈధర్మమును బట్టి ప్రతిపదార్థమును కొంతస్థలమును ఆక్రమించు కొనును. అనగా ప్రతి పదార్థమునకును పొడువు, వెడల్పు, మందము అను పరిమాణములు (కొలతలు) ఉండును. ఇట్టిధర్మమునకు "పరిమేయత" యని పేరు.

2. అభేద్యత (Inpenetrability).—రెండుపదార్థములొక్కకాలమున ఒకచోట నుండుటకు వీలు లేదు. ఈ గుణము గట్టిగానుండు ఇనుమునకును, పలుచగా నుండు గాలికిని సమా

నము. గాలియున్నచోట నొక యినుపముక్కను ఉంచదలచితి మేని యాగాలిని అచ్చటినుండి తొలగింపవలయును. గాలియు ఇనుమును ఏకకాలమందు నొక్కచోట నుండజాలవు. ఒకకఱ్ఱ లోనికి ఇనుపమేకు కొట్టినయెడల ఆకఱ్ఱయు మేకును ఏకకాలమం దొకచోట లేవా యని చదువరు లడుగవచ్చును. లేవనియే ప్రత్యుత్తరము. మేకు ఆకఱ్ఱయొక్క యణువులను ఇటు నటుత్రోసి స్థలము చేసికొని అందు ప్రవేశించెనే కాని మరి వేరుకాదు.

3. సచ్ఛిద్రత (Porosity).—మన మొక యిటికముక్కను గాని అద్దుడుకాగితమునుగాని తీసికొని, దానిమీదకొంచెముసీరు పోసిన అది లోపలికి ఇనికిపోవును. చాల నీరు పోసిన యెడల రెండవ వైపునుండి కారును. ఇట్లువచ్చుటకు దానియందు రంధ్రము లుండవలెను. ఆరంధ్రములలో నీరుచొచ్చియిట్లు కారును. ఇట్లు రంధ్రములు కలిగియుండుటకు 'సచ్ఛిద్రత' యని పేరు. ఇట్లు పదార్థములు సచ్ఛిద్రములుగా నుండుటకు వాని యణువుల యంతరమె కారణము. ఆయణువులు ఒకటి నొకటి యంటి యుండక కొంచెము అంతరము కలిగి యుండును. వేరువేరు పదార్థములలో ఈ అంతరము వేరువేరువిధముగ హెచ్చుతగ్గులుగ నుండును. కాని యన్ని పదార్థములలోను ఈధర్మముండును. కఱ్ఱకు సచ్ఛిద్రతకలదు. బంగారమునకీ గుణము కలదు.

బంగారపుబంతి చేసి లోన నీరుపోసి దానిరంధ్రమును బంగార ముక్కతో పూడ్చి, యాబంతిని యన్నిప్రక్కల నుండియు నొత్తగా లోనినీటికణములు దానిచ్ఛిద్రములలో నుండి వెడలును. ఇనుము నకుగూడ 'సచ్ఛిద్రత' యను ధర్మము కలదని శాస్త్రజ్ఞులు కనుగొనిరి!

ప్రయోగము:—1. కొన్ని నూలుదారములను కట్టగట్టి, ఆకట్టయొక్క ఒకకొనను నీటియందుంచిన కొంతసేపటికి రెండవ కొననుండి నీరుప్రవహించును. ఈధర్మమువలననే దీపమునందు వత్తిగుండా చమురుపైకి పీల్చబడుచున్నది.

2. నాలుగంగుళముల పేప (Cane) బెత్తము ముక్కను సంపాదించి దాని ఒకకొనను సారాయి యందుఉంచి రెండవకొనను వెలిగించిన అది దీపమువలె వెలుగును. ఈ దీపము సారాయి అంతయు మండువరకు వెలుగుచుండును. దీనికి కారణము, ఈ బెత్తముయొక్క చిన్నరంధ్రముల గుండా సారాయి రెండవ కొనకు ప్రవహించి దీపముగా మండుచున్నది.

4. భారము (Weight).— పదార్థము లన్నియు బరువు కలిగి యుండుటచే 'భారము' దానిముఖ్యగుణ మని చెప్పవచ్చును. ఈగుణము దీని కెట్లు కలిగినదో ముందు విచారింపనగును.

5. కాఠిన్యత (Hardness).—మన మొక సుద్దముక్కను, కర్రను, ఇనుపమేకును, గాజుపెంకును తీసికొని ఒకదానితో నొకటి గోకుటకు ప్రయత్నించిన మొదటి రెండును మిగిలిన రెంటిచే సులభముగా గోకబడును. దీనిని బట్టి చూడ కొన్ని

పదార్థములు తక్కిన వానికంటె కఠినమైన వని తెలియ వచ్చును. మనము సాధారణముగా వజ్రమును వజ్రముతప్ప మరియేదియు కోయలే దని వినుచుందుము. దీనికి కారణము వజ్రముకంటె కఠినమైనపదార్థము లేకపోవుటయే. ఇట్టి గుణమునే 'కాఠిన్యత' యందురు.

ఈ క్రింద నొకదానికంటె నొకటి కఠినమైన పదార్థముల పట్టిక వివరింపబడినది. అందు క్రిందది పైవాటి గీయగల శక్తి గలిగి యుండును. అన్నిటికంటెను చివరవజ్రము ఇయ్యబడినది. అది తక్కిన యన్నిటిని గీయగలదు గాని మరియేదియు దానిని గీయ లేదు.

| | |
|---|---|
| 1 మెత్తనియభ్రకము.<br>2 సైంధవ లవణము | గోటితో గీయబడును. |
| 3 కాల్క్ స్పార్<br>4 నాపరాయి<br>5 అపెటైట్<br>6 పెల్ స్పార్ | ఉక్కుతో గీయ వచ్చును. |
| 7 శిలాస్ఫటికము.<br>8 గోమేధికము.<br>9 కురువిందము.<br>10 వజ్రము. | ఉక్కుతో గీయుటకు సాధ్యము కాదు. |

6. భిదురత (Brittleness).—మన మొక చిన్న యిటికముక్కను ఒకగాజుముక్కను తీసికొని యీ రెంటిని

కొంచెము మెత్తునుండి భూమిమీఁద పడవైచిన గాజుపెంకు తుత్తునియలుగా పగిలిపోవును. కాబట్టి కొన్నివస్తువులు ఎక్కువ త్వరలో పగిలిపోవు నని మనకు తెలియును. ఈగుణమునే 'భిదురత' యందురు.

7. విభాజ్యత (Divisibility).—మనము కొంత ఉప్పును తీసికొని చేతితో గట్టిగా నలిపిన అది పొడి యగును; ఆ పొడిని రోటిలో వేసి దంచిపిన ఇంకను మెత్తని పొడిగా మారును; దానిని తీసికొని నీటిలో వేసిన మన కంటికికనుపడనంత చిన్న అణువులుగా మారి నీటిలో కలిసిపోవును. దీనినిచూడ, పదార్థమును మనము చిన్నచిన్న అణువులుగా చేయవచ్చు నని తెలియుచున్నది. ఇట్టి గుణమును 'విభాజ్యత' యందురు.

8. విస్తార్యత (Malleability).—మనము బంగారు వెండి మొదలైనవి మిక్కిలి పల్చని రేకులుగ చేయుట నెరుగుదుము. ఇట్టి రేకులు వేడియన్నముపై పరచిన కరగి పోవునంత పలుచనగా గూడ చేయవచ్చును. లోహము లన్నిటిలో బంగారునందీగుణ మెక్కువగా నున్నది. అనేకవేలరేకులు కలిసి అంగుళములలో నాలవవంతు కంటె నెక్కువ దళసరి కలుగకుండునట్లు చేయవచ్చును; ఇట్టిగుణమును 'విస్తార్యత' యనియు లేక పత్రములవలె చేయబడుటచే 'పత్రకరణీయత' యనియు చెప్పవచ్చును.

9. తంత్రీకరణీయత (Ductility).—బంగారు, వెండి, రాగి మొదలైన వస్తువులను సన్నని తీగగా చేయుట కూడ మన మెరుగుదుము. కొన్ని లోహములు మిక్కిలి సన్నని తీగ చేయుటకు వీలుగా నుండును. ఇంగ్లీషులో 'ప్లాటినమ్' అను లోహము వడ్లగింజంత యుండిన దానిని సుమారు మైలు పొడవైన తీగగా చేయవచ్చును. దీనినే 'తంత్రీకరణీయత' యందురు. ఇది పైగుణముతో సంబంధించి యున్నది.

సీసమును సన్నని రేకులుగా కొట్టవచ్చునుగాని, తీగగా చేయుటకు వీలులేదు.

10. స్థితిస్థాపకశక్తి (Elasticity).—మన మొక రబ్బరు బంతిని తీసికొని దానికి మసి బూసి తెల్లని గోడపై గొట్టిన ఒక పెద్ద నల్లని మచ్చపడును. ఇంత పెద్దమచ్చ పడుటకు కారణ మాలోచించి చూచినయెడల బంతి గోడను తగిలిన సమయమందు ఆమచ్చ పడినంత వరకు అది నొక్కబడినదనియు తర్వాత వెనుకటిస్థితిని పొంది తిరిగి క్రిందబడినదనియు తెలియును. ఈవిధముననే దంతపుబంతి, రబ్బరుగొట్టము మొదలైన వన్నియు తమస్థితి యేకారణముచేతనైన మారినప్పుడు తిరిగి తమ ప్రథమస్థితిని పొందుటకు ప్రయత్నించును. ఇట్టి గుణము 'స్థితిస్థాపకత' యని చెప్పబడును.

11. జడిమ (Inertia).—ఇవన్నియు గాక ఏవస్తువును గాని తనంతట తాను ప్రదేశము మార్చుకొనగల శక్తి లేదని

మన మెరుగుదుము. జడమునకు చలన మెక్కడిది? మన మొకవస్తువును ఒకచోనుంచి దానినక్కడ తిరిగిచూడనియెడల దాని నెవరో తీసి రని వెంటనే తెలిసికొందుము. ఇట్టి స్వభావము ప్రతివస్తువునందును గలదు. దీనినే 'జడిమ' లేక 'జడత్వము' అనవచ్చును.

జడత్వమభావసూచక ధర్మము.—సకల జడపదార్థములును చలనమును గురించిగాని నిశ్చలతను గురించిగాని యౌదాసీన్యమును అవలంబించి యుండును. అనగా, నిశ్చలత గల జడపదార్థము తనంతట తాను గమనమును చెందనేరదు. గమనముగల పదార్థము తనంతట తాను గమనమును విడిచి నిశ్చలత చెందనేరదు. బహిఃప్రేరణ(Outward stimulus) గలిగిన గాని జడపదార్థములయొక్క స్థితి మారనేరదు; లేనియెడల నవి యున్నవి యున్నట్టుగానే యుండును. ఇందున గురించి శోధనచేసిన న్యూటన్ గతిని (Motion) గురించిన మొదటి సిద్ధాంతము (Law) నిట్లు చెప్పుచున్నాడు:—

బహిఃప్రేరణ లేని యెడల పదార్థ మెప్పుడును ఉన్న స్థితిలోనే యుండును. అనగా, నిశ్చలావస్థలో నున్నయెడల అట్లేయుండును. చలనావస్థలో నున్నయెడల అట్లేయుండును.

అనగా, ఒకబంతి యొకచో నిలిచియున్న దాని నెవరైన కదిలించు వరకది యట్లె యుండును; దాని నొకసారి కదిలించి దొర్లజేసిన నది మరల నేశక్తిచేతనైన అడ్డగింపబడు

వరకు దొర్లుచునే యుండును. ఈ వాక్యముయొక్క మొదటి భాగము స్పష్టమే గాని రెండవ భాగ మంతగా స్పష్టము కాక పోవచ్చును. ఒకసారి కదలించిన బంతి యెప్పుడు కదలుచునే యుండుట లేదు. కొంతసేపునకు ఆగిపోవును అని చదువరు లనవచ్చును. నిజమే కాని అందువలన ఈసిద్ధాంతము అసత్యము కానేరదు. కదలించినబంతిని కొన్ని శక్తులు అడ్డగించుచున్నందున అది ఆగిపోవును; లేనియెడల అది యెప్పుడు కదలుచునే యుండును. ఇట్లు అడ్డగించువానిలో గాలి యొకటి. గాలి లేని స్థలములో బంతి యెక్కుడుకాలము కదలుచుండును. భూమియొక్క ఘర్షణ (Friction) గరుకుతనము బంతి నడ్డగించెడి రెండవశక్తి. గరుకునేలకంటె నున్ననినేలమీద బంతి యెక్కుడుకాలమువరకు దొర్లుచుండును. భూమియొక్క యాకర్షణశక్తి బంతినాపెడి మూడవశక్తి. ఈకారణములచే బంతి కొంతకాలమున కాగును. లేనియెడల ఒకసారి బయలు దేరినబంతి యెప్పటికిని పోవుచునే యుండును.

పదార్థముయొక్క జడత్వమునకు మరికొన్ని సాధారణమైన యుదాహరణములు:—

మనము బండిలో గూర్చుండియున్నప్పుడు, బండి ముందుకు కదలిన మనము వెనుకకుపడుదుము; ఏలయనగా, బండి ముందుకు కదలినను మనలోని జడశక్తి మనలను వెనుకనే యుంచును. మన క్రిందిభాగము బండితో కలిసియుండుటచే

దానితో కదలి, పైభాగము కదలకుండుటచే వెనుకకు పడుదుము. ఆకారణముచేతనే మనము నడచునప్పుడు కాలికిరాయి తగిలిన ముందుకు పడుదుము; మన శరీరమంతయు చలనములో నున్నప్పుడు, కాలికి రాయి తగిలి యాభాగము ఆగిపోయినను, తక్కిన భాగములు వెనుకటిస్థితిలోనేయుండుటచే, అనగా చలనము కలిగి యుండుటచే, ముందుకు పడుదుము.

గుఱ్ఱపుసవారి చేయునపుడు, అజాగ్రత్తగా నుండి గుఱ్ఱమును విడిచిన, వెనుకకుపడుదుము; గుఱ్ఱము పరుగిడుచు అకాత్తుగా ఆగిన, ముందుకు పడుదుము; అట్లే రైలు ఆగినప్పుడు గూడ ముందుకు పడుటయు అకాత్తుగా కదలినప్పుడు వెనుకకు పడుటయు తటస్థించును. దీనికంతకు కారణము స్వభావసిద్ధమైన జడిమయే.

---

# మూఁడవ అధ్యాయము

## కొలత

భౌతిక శాస్త్ర సంబంధమైన ప్రయోగములు చేసి పదార్థముల ధర్మములను కనుఁగొనవలయు నన్న మనము కాల స్థల పదార్థముల కొల్తనుగూర్చి కొంత యెరిగి యుండవలయును. ధ్వని ఒక సెకన్డు (second) కు నెంత దూరముపోవుననిశోధించునపుడు మనము కాలపరిమాణమైన 'సెకన్డు' యొక్కస్వరూపమును, స్థలమానమైన మైలు మొదలయినవానిని చక్కఁగ నెరిగి యుండవలయును గదా. కావున ఆకొల్తలను గురించి యిచ్చట కొద్దిగా వివరించెదము. మేము ఈకొల్తలను గురించి వ్రాయుసంగతులు సాధారణముగా జనసామాన్యమునకు తెలిసినవే యైనను బాలురబోధార్థమై సంగ్రహముగా వ్రాయుచున్నాము.

### (అ) పొడవుకొల్త

పైని చెప్పిన దానినిపట్టి చూడఁగా ప్రతివస్తువును కొంత స్థల మాక్రమించుననియు, ఆస్థల మాక్రమించుటలో అదికొంత పొడవును వెడల్పును గలిగి భూమిమీద కొంతయాక్రమణ చేయుటయే గాక, కొంత దళసరిగూడఁగలిగి భూమిపైనఁగూడ కొంతస్థల మాక్రమించుననియు తెలిసికొనవలయు; ఏవస్తువు

ఎంతస్థల మాక్రమించునో తెలిసికొనుటకు, దానికి తగినకొలత కావలెను. ఏవస్తువు నైనను కొలవవలెననిన నొక 'మానము' (standard) కావలెను. నావద్ద వేయిరూపాయలున్న వనిచెప్పిన యెడల, 1 రూపాయ మానముగా తీసికొనబడినదనియు, నట్టివి నావద్ద వేయి యున్నవనియు గ్రహింపబడును. ఆలాగుననే ఒక యూరినుండి మరియొకయూరికి 20 మైళ్ల దూర మున్న దనిన, 1 మైలు కొలతకు మానముగా తీసికొనబడి, యట్టివి 20 ఆదూర మున నున్నవని తెలియును. దీనినిబట్టి 'మాన' మననేమియో, దాని యుపయోగ మేమియో, దెలియుచున్నది.

పొడుగు, వెడల్పు, దళసరి యీమూడును మూడుపొడవులనలె నెన్నదగును. పొడవుకొలుచుటకు కావలసిన సాధనమే ఈమూటిని కొలుచుటకు కావలయును.

పొడవును కొలుచుటకు మనకొక మాన మావశ్యకము. సాధారణముగా మనదేశమున ఎక్కువ దూరమును కొలుచుటకు మైళ్లును, తక్కువ దూరమును కొలుచుటకు గజములు, అడుగులు, అంగుళములును, 'మానము'లుగావాడబడుచున్నవి. వీనికిగల సంబంధము.

| | | |
|---|---|---|
| 12 | అంగుళములు (అం) | = 1 అడుగు. (అ) |
| 3 | అడుగులు | = 1 గజము. (గ) |
| 1760 | గజములు | = 1 మైలు. (మై) |

ఒక అంగుళముకంటె తక్కువదూరము కొలుచుటకు అంగుళములో భాగములు కావలయును; అర, పాతిక, పరక, అంగుళములు వాడుకలో నున్నవి.

ఇప్పుడు అంగుళములను మైళ్లలోనికి గాని. మైళ్లను అంగుళములలోనికి గాని మార్చుటకు, ఆసంఖ్యను, క్రమముగ 12, 3, 1760 చేత తగ్గించుట (భాగించుట) గాని, హెచ్చించుట గాని చేయవలెను. ఈసంఖ్యలచేత హెచ్చించుటగాని తగ్గించుటగాని సులభసాధ్యముగాక, కాలవ్యయమును కలుగుటచే 'ఫ్రాంసు' మొదలైన దేశములలో మరియొక 'మానము' వాడబడుచున్నది. దానికి 'మీటర్ మానము' (metric system) అని పేరు.

10 చేత ఏసంఖ్యనైన హెచ్చించుటగాని తగ్గించుటగాని మిక్కిలి సులభ మగుటచే ఈ మానమునందు ప్రతిమానమునకు 10 చే సంబంధము గలుపబడును. అనగా నొకదానికిని మరియొకదానికిని 10 రెట్లుగాని 10 వ వంతుగాని సంబంధముండును.

ఈ మానమునందు తీసికొనబడిన చిన్నకొల్త 'మీటరు'. ఇది అంగుళములలో కొలిచిన 39 అంగుళములమీాద రమారమి మూడవవంతు ఉండును.

1 మీటరు (మీ)= 10 దశాంశమీటరులు (దశ. మీ)= 100 శతాంశమీటరులు (శ.మీ)=1000 సహస్రాంశ మీట

రులు (సహ.మీ) గానువిభజింపబడి ఒక దానిలో నొకటి పదియవ వంతుగాను, అన్నిటిలోచిన్నదైన 'సహస్రాంశ మీటరు' మీటరులో వేయవవంతుగాను ఉన్నవి.

ఇట్టిమానము గణితమునందు మిక్కిలి సులభముగా నుండును. ఎట్లన:

ఉదా:—4 మీటరులకు ఎన్ని శతాంశమీటరు లనిన, నూరుచే గుణించి 400 అని వెంటనే నోటిలెక్కగా చెప్పవచ్చును. 4600 సహస్రాంశ మీటరులు ఎన్ని మీటరులు ఎన్ని శతాంశమీటరు లనిన, వేయిచేభాగించి 4 మీటరులు, 10 చే భాగించి 60 శతాంశమీటరులు అని చెప్ప వచ్చును.

మీటరుకంటె నెక్కువ పొడవు కొలుచుటకు, 10 మీటరులు,( మీ.)=1 దశమీటరు (ద.మీ.); 10 దశమీటరులు= ఒకశతమీటరు (శ.మీ), 10 శతమీటరులు= 1 సహస్రమీటరు (స.మీ.)గాను భావించుకొనవచ్చును.

అంగుళములు.



సహస్రాంశ మీటరులు. శతాంశమీటరులు.

1 అంగుళము (అం)=$2\frac{1}{2}$ శతాంశమీటరులు.($2\frac{1}{2}$శత.మీ.)

5 మైళ్లు = 8సహస్ర మీటరులు. (8 స. మీ)

ఈపైని కొలతబద్దయొక్క పట మీయబడినది. అందొక వైపు అంగుళములును అందలిభాగములును చూపబడినవి. మరియొకవైపు 'మీటర్‌మానము' లోని 'శతాంశ మీటరులు' (centimetre) చూపబడినవి.

పొడవుకొలచు విధములు

తిన్ననిగీత పొడవు:—సాధారణముగా బల్ల అంచుగాని, పలక అంచుగాని, పుస్తకము అంచుగాని, తిన్నని గీతగా నుండును. ఆ అంచుయొక్క పొడవును కొలుచుటకు ఒకకొలత బద్ద కావలయును. ఆపుస్తకముయొక్క ఒకఅంచును బద్దయొక్క సున్నకుసరిగా పైనపెట్టిరెండవఅంచు ఏభాగమునకు సరిగాపైన యుండునో చూడవలెను. ఆరెండు అంచులును సున్నకును 10 కిని సరిగాయున్నదాని పొడవు 10 శతాంశమీటరులు అగును. శతాంశమీటరుభాగముతోగాక పైనకొన్ని సహస్రాంశమీటరులు గూడయున్న ఎన్నో చిన్నభాగమునకు అంచుసరిగానుండునో చూడవలెను. 4 వ భాగమునకు సరిగానుండిన దానిపొడవు 10 శతాం. మీ 4 సహ. మీ. రెండు సహస్రాంశ మీటరుల మధ్య నింక భాగములులేవు. అంచు ఆమధ్యనుండిన ఆభాగము కంటితో గుర్తించవలెను. ఒక సహస్రాంశమీటరును మన

సులో 10 భాగములుచేసి అందెన్ని భాగములు ఆక్రమింపబడి నవో చూడవలెను.

నాలుగు దశభాగములైన దానిపొడవు (·4) అయిదైన (·5) ఆరైన (·6) అని వ్రాయవచ్చును. కాబట్టి మొత్తము పొడవు 10 శత. మీ. 4. సహ మీ. మీద 4 దశభాగములు అనగా 10 శత. మీ. 4.4 సహ. మీలు. లేక 10·44 శత.మీ.

పొడవు కొలచుటయందు, సాధ్యమైనంతవరకు సున్నగీత నుండి కొలుచుట మంచిదిగాదు. ఏలయన మొదటిభాగము


2 వ పటము.

సాధారణముగా అరిగిపోయియుండును. అందుచేత బద్ద యొక్కమధ్యనుండి కొలువవలెను.

3 వ పటము.



ఒకప్పుడు “భాగసాధనము” (dividers.) అనునది కొలచుట కుపయోగించవచ్చును. ఒకచిన్న గోళముయొక్క మధ్యరేఖను కనుగొనుటకు భాగసాధనముయొక్క కొనలను గోళమును తగులునట్లుగా బెట్టి (3-వ పటము) తరువాత బద్దమీద




బెట్టి ఆకొనలమధ్య దూరమును కనుగొనవలెను. అదేగోళము యొక్క మధ్య రేఖ. (4-వ పటము)

ఒక్క అద్దపుబిళ్లయొక్క మధ్య రేఖ కనుగొన వలెననిన 5-వ పటమునందు చూపినప్రకారము సమకోణములుగల పలకలు రెంటిని గోళమునకు రెండువైపుల బద్దకానున ట్లుంచవలెను.




ఒక గోళముయొక్క మధ్య రేఖను, మరియొకవిధమునగూడ కనుగొనవచ్చును. 6-వ పటముచూడు. ఇందు రెండు వైపుల నున్నవి సమకోణములుగల కర్రదిమ్మలు. మధ్యనున్నది గోళము. వాని పైది కొలతబద్ద.

భాగసాధనముతో 2, 3, 4, 5, 6 అంగుళములకు ఎన్ని శత. మీ.లో కొలిచి, 1అం. ఎన్ని శత. మీ.లో కనుగొనుము. (1 అం=2½ శత. మీ )

### వంకరగీతలను కొలచుట

1. భాగసాధనముయొక్క కొనలను రెండు సహస్రాంశ మీటరుల దూరమునకు చేర్చి, వంకరగీతయందు అట్టివి ఎన్ని భాగము లున్నవో కనుగొనవలెను. 10 యుండిన ఆగీత పొడవు 20 సహ. మీ.; 20 యుండిన ఆగీతపొడవు 40 సహ.మీ.

2. ఒకసన్నని దారమును తీసికొని దానిని గీతకుసరిగా ఒక కొనయందు బెట్టి రెండవకొనవరకు చిన్న చిన్న దూరములు కొలువవలెను. తరువాత ఆదారముయొక్క పొడవును బద్దతో కొలువవలెను.



7 వ పటము.

3. ఒకకాసని సంపాదించి దానిమధ్య రేఖను, చుట్టుకొలతను కొలిచి ఆరెంటికిని గల సంబంధమును తెలిసికొనుము.

$$\frac{\text{చుట్టుకొలత.}}{\text{(మధ్య రేఖ)}} = \frac{22}{7} \text{ (సుమారు)}$$

ఈసంబంధమే ప్రతి గుండ్రనివస్తువుయొక్క చుట్టుకొలత కును, దానిమధ్యరేఖకును ఉండును.

4. ఒక గుండ్రని కడ్డీ (స్థూపము)ని సంపాదించి దానితో పై సంబంధమును కనుగొనుము.

కాబట్టి ఈసంఖ్య ఎప్పుడును ఒకటిగానే యుండును. అందుచేత వీనిని "స్థిరసంఖ్య" యని చెప్పవచ్చును. ఈ స్థిరసంఖ్యను సాంకేతికముగా (ప) అని చెప్పుదము. ప = $\frac{22}{7}$

(ఆ) ప్రదేశముయొక్క చతురపు కొలత:

ఇంతవరకు మనము 'పొడవు'ను కొలచుట తెలిసికొంటిమి. అడుగుబద్దలు, గజము బద్దలు, లేక అడుగులుఅంగుళములుగా విభజింపబడిన 'టేపు', వీనివలన నట్టి పొడవునుకొలవగలము.

ఇప్పుడు ఒకగదిలో చాపగాని తివాసిగాని వేయింపవలె ననిన, లేక ఒకప్రదేశముగ్గాని పొలముగాని కొనవలె ననిన, దానిని కొలుచుటయందు నొక్కపొడవు మాత్రము కొలిచిన సరిపడదు. దాని చతురమును కనుగొనుటకు రెండుకొలతలు కావలయును. 8 వ పటములో చూపినట్లు 'అ, ఇ, ఈ, ఆ అను నొకపొల ముండిన దాని చతురమును కనుగొనుటకు అ ఆ, అ ఇ అను రెండుప్రక్కలను కొలువవలయును.

చతురమును కొలుచుటయందును మన కొక 'మానము' కావలయును. అట్టి మానము 1 అంగుళము పొడవు 1 అంగుళము వెడల్పు గలిగి, 1 చతురపు అంగుళ మని చెప్పబడును. 8 వ పటములో ఇట్టి చతురపుఅంగుళములు తొమ్మిది కలవు.

ఈవిధముననే, 1 చతురపుఅడుగుగాని, 1 చతురపు గజముగాని మానముగా తీసికొని మనము కొలతవేయవచ్చును. 1 చతురపు అంగుళము మానముగా తీసికొని 3 అంగుళములు పొడుగు 3 అంగుళముల వెడల్పుగల ప్రదేశమునందు, 9 చతురపు అంగుళముల ప్రదేశమున్నట్లు 8 వ పటములో చూచుచున్నాము. అనగా నట్టి ప్రదేశముయొక్క చతురము, దానిపొడవును వెడల్పుచే హెచ్చించిన వచ్చును. అట్లెందుకు హెచ్చింపవలయునో పైని చెప్పినద్దానిని బట్టి తేటపడుచున్నది.

అ ఆ

| | | |
|---|---|---|
| 1 | 2 | 3 |
| 4 | 5 | 6 |
| 7 | 8 | 9 |

ఇ ఈ

8 వ పటము.

| | | | |
|---|---|---|---|
| 1 చతురపు అంగుళము | = 1 చ. అం. | | అను సంకేత ములచే వాడ నగు. |
| 1 ,, అడుగు | = 1 చ. అ. | | |
| 1 ,, గజము | = 1 చ. గ. | | |
| 1 ,, గజము | = 9 చ. అ. | | |
| 1 ,, అడుగు | = 144 చ. అం. | | |

మీటరుమానము ప్రకారము ఒక చతురపు శతాంశ మీటరును మానముగా గ్రహింపవచ్చును.

100 చ. సహ. మీ = 1 చ. శత. మీ.

100 చ. శత. మీ = 1 చ. దశ. మీ.

10,000 చ. శత. మీ = 1 చ. మీ.

ఒక అంగుళముకు $2\frac{1}{2}$ శత. మీ.అయిన, 1 చ. అం = $\frac{5 \times 5}{2 \times 2} = \frac{25}{4} = 6\frac{1}{4}$ చ. శత.మీ.అగును.



9 వ పటము

దేనియొక్క చతురమునైనను కొలవవలె ననిన గళ్లకాగితములు చాల ఉపయోగముగా నుండును.

9 వ బొమ్మలో చూపబడినట్లు ఆకారము గలదాని చతురమును కనుగొనుటకు, దానిని గళ్లకాగితము మీద గీచి, నిండుగళ్లను మొదట లెక్కింపవలెను. తరువాత దాని హద్దు గీతలుగల గళ్లను సగము కంటె తక్కువయున్న విడిచిపెట్టి,

ఎక్కువయున్న నిండు గడి క్రింద లెక్కించి మొత్తము చేసిన దాని చతురము తేలును.

11_వ పటము.




ఒక వర్తులము (Circle) యొక్క చతురమును కొలవవలెనన్న దానిని 10 వ పటములో చూపినట్లు చిన్న చిన్న త్రిభుజములుగా భాగించి వాని నొకదాని ప్రక్క నొకటి చేర్చిన 11 వ పట మగును. దానియొక్క పొడవును వెడల్పును కొలిచిన దానిచతురము తేలును.

దానిపొడవు వర్తులముయొక్క చుట్టుకొలతలో సగము. వెడల్పు మధ్యరేఖలో సగము. ఈరెంటి గుణకము దాని చతురము.

$\frac{1}{2}$ చుట్టుకొలత $= \frac{1}{2} \times \frac{22}{7} \times$ మధ్యరేఖపొడవు(మ. రే.)

దీనిని మధ్యరేఖలో సగముచే హెచ్చించిన

$$\frac{1}{2}\frac{22}{7} \times \frac{\text{మ. రే}}{2} \times \text{మ. రే.} = \frac{22}{7}\frac{\text{మ. రే}}{2} \times \frac{\text{మ. రే}}{2}$$

$$= \text{ప} \times \left(\tfrac{1}{2}\ \text{మ. రే}\right).$$

అనగా (ప) స్థిరసంఖ్యను మధ్యరేఖలో సగముయొక్క వర్గముచే గుణించిన వర్తులముయొక్క చతురము వచ్చును.

(ఇ) పదార్థము లాక్రమించు స్థలమును కొలుచుట.

ఒక గోడను కట్టవలె ననిన, దానిపొడవును వెడల్పును నిర్ణయించిన సరిపడదు. అది యెంత యెత్తు ఉండవలెనో కూడ తెలియవలెను. దీనినిబట్టి చూడ గోడ కొంతపొడవును వెడల్పును మాత్రము గాక కొంతయెత్తును కూడ గలిగియున్నదని తెలియుచున్నది. అట్టిగోడ ఆక్రమించు 'స్థలము'ను తెలిసికొనుటకు పొడవు, వెడల్పు, ఎత్తు తెలియవలెను. పొడవు వెడల్పుమాత్రము గలదానిని కొలుచుటకు చ. అం. చ. గ. అనుమానములు పనికి వచ్చును. కాని, గోడవలె మూడు కొలతలు (అనగా పొడవు, వెడల్పు, ఎత్తు) గలవానిని కొలుచుటకు చ. అంగుళములసహాయము చాలదు. కనుక నిట్టివానిని కొలుచుటకు వేరు మానము కావలయును. ఇట్టిదానిని 'ఘనమానము' (Cubical measure) అందురు.


12. ఘనము.

1 అ. పొడుగు, 1 అ. వెడల్పు, 1 అ. ఎత్తు గలదానికి 1 ఘన అడుగు అని పేరు. ఈ విధముననే 1 ఘన అంగుళమును 1 ఘన గజమును మానములుగా తీసికొనవచ్చును. 12 వ పటములో చూపబడిన పెద్దపెట్టె ఒక ఘనాంగుళముయొక్క ప్రతిమ. చిన్న పెట్టె ఘన శతాంశ మీటరు (Cubic Centimetre) యొక్క ప్రతిమ.

1 ఘన అడుగు=12 × 12 × 12=1728 ఘన అంగుళములు.

1 ఘన గజము = 3 × 3 × 3=27 ఘన అడుగులు.

దీనివలన ద్రవపదార్థములు ఆక్రమించు స్థలముకూడ కొలువ వచ్చును. 1 ఘ. అ. పరిమాణముగల యొకగిన్నె యుండిన దానియందు 1 ఘ.అ.పరిమాణముగల నీరు పట్టును అనుట స్పష్టము. అనగా, దానిలో నీరు పోసిన 1 ఘ. అ. ఉండును. ఇప్పుడు మనవద్ద ఒక పెద్దగాజు గిన్నెయుండి దానిపై ప్రతి ఘనఅంగుళము నీరు పట్టునంత స్థలమునకు నొక గీత గీయబడి యుండిన, మనము ఏద్రవపదార్థముయొక్క పరిమాణము నైనను సులభముగా తెలిసికొనవచ్చును. ఆనీటిని దానిలో పోసి, అది యెన్ని గీతలవరకు వచ్చిన నన్ని ఘ. అంగుళము లని చెప్పవచ్చును. ఇట్టి గిన్నెలు గాజుతో చేయబడి బజారులో అమ్మబడును. (13 వ పటము.)



13.వ. పటము.

ఇట్టిగిన్నెల సహాయమువలన పొడుగు, వెడల్పు, ఎత్తు, వీనిని అడుగుబద్దతో కొలుచుటకువీలులేని పదార్థములపరి

మాణమును తెలిసికొనవచ్చును. సమానమైన ప్రక్కలు కోణ ములు లేని రాయియొక్క పరిమాణమును మనము తెలిసి కొనవలెననిన ఒక గిన్నె నిండ నీరుపోసి, దానిని అందు జాగ్ర త్తగా జారవిడిచిన కొంతనీరు పైకి పడిపోవును. ఆరాయి నీటిలో మునుగుటచే, దానికిసమానమైన పరిమాణము గల నీరు పైకి వచ్చును. ఆనీరు మరియొకగిన్నెలో జాగ్రతగాపట్టి దానిని కొలతగిన్నెలోపోసిన కొంతవరకు వచ్చును. ఆ నీరుఎన్ని గీ తలవరకు వచ్చిన అన్ని ఘనఅంగుళము లని తెలియును.

కాబట్టి దీనివలన మనము నేర్చుకొనున దేమనగా:—

(1) సమానమైన ప్రక్కలును కోణములును గల వస్తువుయొ క్క పరిమాణమును, దాని పొడవును, వెడల్పును, ఎత్తు ను ఒక దానిచే నొకటి హెచ్చించిన తెలిసికొందుము.

(2) ద్రవపదార్థముల పరిమాణము, అట్టి కొలతగిన్నెలవలన తెలియును.

(3) సమానమైన ప్రక్కలు లేని వస్తువులపరిమాణము కూడ ఇట్టి గిన్నెల సహాయమువలన తెలిసికొన వచ్చును.

సాధారణముగా నితరదేశములందు నుపయోగించు పరి మాణముయొక్క కొలత ఘనఅంగుళములవలన గాదు. 'శతాంశ మీటరు' ను గూర్చి యిదివరకు చెప్పబడినది. 1 శతాంశమీ టరు పొడవును, అంతే వెడల్పును, అంతే ఎత్తును గలిగినదాని పరిమాణము 1 ఘన శతాంశమీటరు అనబడును. 1 ఘనశతాం శమీటరు పరిమాణముగల నీటియొక్క బరువు 1 'గ్రాము

అనబడును. ఈ కొలతలయొక్క యుపయోగము ఈశాస్త్రమును అభ్యసించినకొలదిని చదువరులకు తెలియగలదు.

మనము సాధారణముగా నుపయోగించవలసిన కొలతగిన్నెలపటములు 14-వ పటములో చూపబడినవి. ఇవి ఘనశత. మీ. లో. గుర్తింపబడినవి.

14 వ పటము.




౧. పిప్పెట్టు.
౨. పాత్రము.
౩. బ్యూరెట్టు.
౪. ఫ్లాస్కము.

ఇప్పుడు ఒకగుండుయొక్క ఘనపరిమాణమును తెలిసికొనవలెననిన పాత్రములో 200గీతవరకు నీరు పోసి ఆ

గుండును అందులో జారవిడువుము. ఇప్పుడు నీరు 300 గీతవరకు వచ్చిన ఆగుండుయొక్క పరిమాణము 300-200=100 ఘ.శత మి. అని తెలియును. ఇట్లే తేలికపదార్థముయొక్క పరిమాణము కావలసినయెడల దానిని పరిమాణము తెలిసినఒకగుండుకు కట్టి నీటిలో ముంచిన దానిపరిమాణము కనుగొనవచ్చును.

ఉ:—గుండు పరిమాణము= 100 ఘ. శత. మి.

పాత్రములో నీరు ఉన్నగీత= 200 ,,

రెంటిని నీటిలో ముంచినప్పుడు=350 ,,

కాబట్టి ఆరెంటిపరిమాణము కలిసి=350—200=150ఘ. శత. మి.

అందులో గుండుపరిమాణము=100 ,,

కాబట్టిదాని...,,= 150—100=50 ,,

—: కోణములను కొలుచుట. :—




15 వ పటము.

15 పటములో చూపినట్లు రెండు గీతలొకచో కలిసిన ఒకకోణ మేర్పడును. ఆగీతలు దగ్గ ఱకు వచ్చిన వానిమధ్యనుండు కోణము చిన్న దగును. వ ర్తులమును 360 భాగ ముగా చేసి ప్రతిభాగమునకు "అంశము" అని చెప్పవచ్చును. అందులో నాల్గవభాగము 90 అంశములు గలిగి యుండును. అట్టికోణమునకు సమకోణము అని పేరు. కోణ

ములను కొలుచుటకు "అంశమాపకము" (Protractor) అను సాధనము ఉపయోగించబడును. 16 వ పటము చూడుము.




16 వ పటము.

అంశములోని అంతర్భాగములు:—

1 అంశము (1 °) = 60 మినిట్లు (60')

1 మినిటు = 60 సెకనులు (60")

(ఈ) కాలపరిమాణము; దానికొలత.

ఉదయమున సూర్యు డుదయించుటయు సాయంత్రము అస్తమించుటయు, మరల ఉదయము వచ్చువరకు సూర్యుడు తిరిగి ఉదయించుటయు మనకు తెలిసినవిషయమే. ఇట్లు సూర్య దర్శనమున కొంతకాలము నకు అగుటకు కారణముగూడ మనకు

తెలిసినదే. భూమి తనచుట్టు తాను తిరుగుచు, సూర్యునిచుట్టు తిరుగుచున్నది. ఇట్లు ఒకసారి తనచుట్టు తాను తిరుగుటవలన దివారాత్రములు కలుగుచున్నవి. భూమి గుండ్రని దగుటచే, తిరుగుటలో సగముభాగము మాత్రము సూర్యునివైపు తిరిగి యుండును. మిగిలినభాగము సూర్యునివైపున నుండకపోవుటచే సూర్యకిరణములు వెళ్లుటకు వీలు లేదు. అట్టిస్థితి రాత్రి యన బడును. సూర్యునివైపున్న భాగము సూర్యకాంతి కల దగుట చే పగ లనబడును. ఇట్టి రాత్రియు పగలును కలిసి రెండు సూర్యోదయముల మధ్యకాల మగు చున్నది. అది ఒకదిన మన బడును.

భూమి సూర్యునిచుట్టు తిరిగి తాను బయలుదేరిన ప్రదేశ మునకు తిరిగి వచ్చుటకు కొన్ని దినములు పట్టును. ఇంతలో పల అది 365 సార్లు తనచుట్టు తాను తిరుగును; అనగా 365 దినములు గడచును. అట్టి 365 దినముల కాలము 1 సంవత్సర మనబడును. దినమునందలి భాగములు సరిగా తెలిసికొనుటకు తగిన సాధనములు మనకు కావలెను. అట్టిసాధనములు కొన్ని మనపూర్వు లుపయోగించిరి. అవేవనిన:—

(1) ఒక గిన్నెకు క్రింది భాగమున చిన్నరంధ్ర ముండును. ఆగిన్నెను నీటిలో పడవైచిన, అది మునుగుటకు సరిగా దినముల్లో 24 వ వంతు పట్టును.

గొల్చుట కొకసాధన మని చెప్పవచ్చును. కాని మనత్వగింద్రియ మెల్లప్పుడును యథార్థమయిన శీతోష్ణస్థితిని తెలియజేయక మనలను మోసపుచ్చు చుండును. ఎట్లన, మూడు గిన్నెలు దెచ్చి, ఒకటి మిక్కిలి వేడినీటితోను, రెండవది గోరువెచ్చని నీటితోను, మూడవది మిక్కిలి చల్లని నీటితోను నింపవలెను.





81 వ పటము.

81వ పటము చూడుము. కుడిచెయ్యి మొదటి గిన్నెలోను ఎడమచెయ్యి మూడవగిన్నెలోను ముంచి కొంత సేపుంచిన తరువాత రెండుచేతులు రెండవ గిన్నెలో ముంచినట్లయిన నీగిన్నెలోని గోరు వెచ్చనినీరు ఎడమచేతికంటె, కుడిచేతికి చల్లగ నగపడును. అనగా ఆనీరు కుడిచేతికి చల్లగను, ఎడమచేతికి వేడిగను ఉండును. దీనినిబట్టి మనము త్వగింద్రియమువలన నిశ్చయమయిన ఉష్ణోగ్రత తెలిసికొనలేమని స్పష్ట మగుచున్నది. ఉష్ణమును గొల్చుట కింక మంచిమార్గ మేదైన గలదా యని విచారింతము. పదార్థములు ఉష్ణమువలన వ్యాకోచమును (Expansion), శీతమువలన సంకోచమును (Contraction) బొందు నని పైప్రకరణములో జెప్పియుంటిమి. ఇంతియగాక ఘనపదార్థములకంటె ద్రవపదార్థము లెక్కువ వ్యాకోచమును

బొందుననిగూడ వ్రాసియుంటిమి. ఏదయిన ద్రవపదార్థ మొక సన్నని గాజుగొట్టమున నుంచి వేడినీటిలో ముంచిన యెడల ఆ వేడిమికి గొట్టములోని ద్రవపదార్థ మెక్కువై పైకిప్రాకును. అప్పుడు అది చల్లని నీటిలో ముంచినయెడల తిరిగి మునుపటి స్థలమునకు దిగిపోవును. ఇట్లు ద్రవపదార్థముల వ్యాకోచ, సంకోచములను కనిపెట్టి పదార్థము లెంత వేడిగనున్నవి తెలిసి కొనవచ్చును. ఇట్టి సాధనమునకే 'ఉష్ణతామాపకము' (Thermometer) అని పేరు. దాని నిర్మాణవిధాన మీ క్రింద వ్రాయబడును.

## ఉష్ణతామాపకము. (THERMOMETER).

ఉష్ణతామాపక మనగా ఉష్ణోగ్రతను కొల్చునది యని యర్థము. ఇదియొక సన్నని గాజుగొట్టముతో చేయబడును.

84 వ పఠము. ఒక సన్నని గాజుగొట్టము తీసికొనుము. అది యొకచివరను ఉబ్బుగ నుండి మూయబడి యుండవలెను. రెండవచివర తెరవబడియుండవలెను. ఈ గాజుగొట్టములోని రంధ్రము అంతటను సమానముగానుండును. అనగానొకచోట చిన్నదిగను మరియొకచోట పెద్దదిగను ఉండదు. ఈరంధ్రము మిక్కిలి సన్నది. తలవెండ్రుకకంటె గూడ గొన్నిటిలో సన్నగా నుండును. ఇట్టిగొట్టములో పాదరసమునింపవలెను. ఈ రంధ్రము చిన్నది యగుటచేతను, అందు గాలి యుండుటచేతను దానిలో పాదరసము నిండుట కష్టము. కావున ఆగొట్టమును కారుతో

పట్టుకొని యుబ్బుగా నున్న దాని క్రిందిభాగమును దీపము మీఁద వెచ్చచేయుము. తరువాత నాగొట్టమును తల క్రిందుచేసి తెరవఁ బడియున్న దాని చివరను పాదరసములో ముంచుము. కొంత రసము గొట్టములో నెక్కును. ఎందు కెక్కును? వేడి చేసి నప్పుడు గొట్టములోనిగాలి కొంత పల్చనై పైకిలేచిపోవును. ఇట్లు అందలి గాలి కొంత తగ్గును. అందుచే గొట్టమును తల క్రిందుచేసి రసములో ముంచినప్పుడు గొట్టములోని గాలిబలము కంటె వెలుపలి గాలిబలము ఎక్కువ యైనందున గొట్టములో నికి కొంతపాదరస మెక్కును. మరల గొట్టమును వెచ్చచేసి రసములో పూర్వప్రకారము ముంచుము. ఇట్లు నాలుగైదు పర్యాయములు చేసినయెడల గొట్టముక్రింది యుబ్బుభాగమును మీఁదిగొట్టముయొక్క కొంతభాగమును, రసముతో నిండును. అటుపిమ్మట గొట్టములోని కొంతపాదరసము ఆవిరియై గొట్ట ములోమిగిలినగాలినంతను వెడల గొట్టువరకుగొట్టమును కాచి, గొట్టముయొక్క తెరవబడియున్న చివరభాగమును కరగించి మూసివేయుము. గాజును కరగించి మన కిష్టమైన యాకా రముగా మార్చుట కష్టము కాదు. ఇట్లు తయారైన గొట్టమే యుష్ణతామాపక యంత్రము.

### గొట్టముమీఁద గుఱుతులు వేయుట.

ఇట్లు మూయబడిన గొట్టముమీఁద మన మిక, ఇంత వేడికి పాదరస మింతవరకు నెక్కును, ఇంతవరకు దిగును అని

చూపుటకు గుర్తులు వేయవలెను. ఒకపాత్రలో నీరుపోసి యందు నీగొట్టమును నిలువబెట్టుము. అనగా పాదరసముతో నిండియున్న భాగ మంతయు పాత్రలో నుండునట్లును, మూయబడినకొన మీదికి నుండునట్లును పెట్టుము. పాత్రక్రింద దీపము పెట్టినీళ్లనుకాచుము. 82వపటముచూడుము. నీళ్ళుకాగి వేడిమి హెచ్చినకొలదినిగొట్టములోనిపాదరసముమీదిమీది కెక్కును. ఇట్లు నీళ్ల కెసరు వచ్చు వరకును పాదరస మెక్కుచుండి, యెసరు వచ్చినతరువాత మీది కెక్కక నిలిచి యుండును. ఇట్లు నీళ్లకు నెసరు వచ్చునప్పుడు పాదరసము గొట్టములో నెంత యెత్తు ఎక్కినదో యచ్చట నొకగుర్తు పెట్టుము. అచ్చోటికి 'నీటి కెసరువచ్చు స్థలము' లేక 'ఎసరుస్థలము' (Boiling point) అని పేరుపెట్టుదము. ఉష్ణతా మాపకములు చేయువారు గొట్టమును నీళ్ళలో పెట్టక, యందుండి వచ్చు నావిరి గొట్టమున కంతకును తగులునట్లు పెట్టుట మంచిది.


82 వ పటము.

గొట్టమును వేడినీళ్ళ యావిరిలో నుండి తీయుము. ఒక గిన్నెలో మంచుగడ్డ తునుకలు వేసి, యందు రసము మునుగువరకు నీ గొట్టమును నిలువ బెట్టుము. 83వ పటము చూడుము. చలి హెచ్చుటచే పాదరసము క్రిందికిదిగిపోవును. పాదరస మెంతవరకు దిగిపోయి నిలు

చున్నో యా స్థలమున నొకగుర్తుపెట్టుము. దీనికి 'నీళ్ళు మంచు గడ్డయగుస్థలము' లేక 'మంచు కట్టుస్థలము' (Freezing-point) అని పేరు పెట్టుదము.



ఇప్పుడు గొట్టముమీద రెండుగుర్తులు ఏర్పడినవి. ఒకటి గొట్టముయొక్క పైభాగమందును, మరియొకటి గొట్టముయొక్క క్రిందిభాగమందును ఉన్నవి. క్రింద గుర్తుపెట్టిన స్థలమునకు (0) సున్నగుర్తును, మీది స్థలమునకు (100) నూరు అను అంకెయు గుర్తుగా బెట్టి వీని నడుమ నున్న యంతరమును నూరు విభాగములుగా చేయుడి. ఈ నూరువిభాగములలో నొక్కొక దానికి 'అంశము' (Degree) అని పేరు. ఇది యుష్ణోగ్రతను కొలు

83 వ పటము.

చుటకు నేర్పడిన మానము. మంచుగడ్డయొక్క యుష్ణోగ్రత యెంత? అను ప్రశ్నకు 'శూన్యాంశము' అని జవాబు. ఎసరువచ్చిన నీటికి నెంత యుష్ణోగ్రత గలదు? నూరు అంశములు. ఇట్లు ఏవస్తువుయొక్క ఉష్ణోగ్రతనైనను మనము కనుగొనవచ్చును. కొంచెము వెచ్చగానున్న నీటిలో నెంతయుష్ణోగ్రత కలదో చూడవలె నన్న ఉష్ణతామాపకమును అందులో పెట్టుము. గొట్టములోని పాదరసము (95°) తొంబదియైదు అంశములవరకు నెక్కును అనుకొనుడు. కావున ఆనీరు 95° తొంబదియైదు అంశములు వేడిగా నున్నదియని యర్థము. సూర్యరశ్మి

యెంత వేడిగానున్నదో కనుగొనుటకు 'ఉష్ణతామాపకము' ను కొంచెము సేపు ఎండలో బెట్టిన చాలును. గొట్టములోని పాదరసము ఎండయొక్క యుష్ణోగ్రతను తెల్పగలదు.

ఇట్లు నూరు అంశములుగా విభజింపబడిన యుష్ణతామాపకమునకు 'శతవిభాగి' 'శ' (Centigrade) అని పేరు. 84 వ పటము చూడుము.

గాజుమీద గుర్తులు వేయు టెట్లు?



ఇట్లు నూరుభాగములుగా గొట్టమును విభజించితిమే కాని యీ గుర్తులు గాజుగొట్టముమీద శాశ్వతముగానుండు టెట్లు? ఈ గాజుగొట్టముచుట్టును మైనముతో పూత పూయుదురు. ఆమైనముమీద సన్నసూదితో ఈగుర్తులన్నియు వ్రాయుదురు. అనగా సూదితో నీగుర్తులు వ్రాసినచోట గొట్టముయొక్క భాగము వెలువడును. మిగిలినభాగము మైనముతో కప్పబడి యుండును. ఇట్టిగొట్టమును హైడ్రోఫ్లోరిక్ ఆసిడ్ (Hydrofloric acid) అను ద్రావకములో ముంచుదురు. గాజునుతినుట యీద్రావకముయొక్క యొక ధర్మము. కావున మైనము లేనిచోట నంతను అది గొట్టమును కొంచెము తినును. ఇట్లు గొట్టముమీద నంశముల గుర్తు లేర్పడును.

84 వ పటము.

వేరు వేరువిధముగ విభాగించుట.

నీరు గడ్డ కట్టు స్థలమునకును, నీటి కెసరువచ్చు స్థలమునకును గల యంతరమును 100 అంశములుగా 'ఉష్ణతామాప

కము' లో విభాగించెద రనియు, అట్టిదానిని శతవిభాగి (Centigrade) అందురనియు చెప్పియున్నారము. ఇట్టి 'శత విభాగి' సాధారణముగా నన్ని శాస్త్రీయ శోధనలలో నుప యోగింతురు.

మరికొన్ని యుష్ణతామాపకములలో నీరెండుస్థలముల యంతరమును నూటయెనుబది (180°) యంశములుగా విభాగించెదరు. ఇట్టియంత్రములను ఫహారెన్‌హీట్ (Fahrenheit) 'ఫ' అందురు. ఈయంత్రములో నీళ్ళు మంచుగడ్డకట్టునట్టిస్థలమునకు క్రింద 32 అంశములు గుర్తువేయబడును. మంచు కట్టనప్పుడున్న చలికంటె నెక్కుడు చలియున్నయెడల ఈగుర్తుల వలన కనుగొనవచ్చును. ఇట్లు ఫహారెన్‌హీట్ యంత్రములో మంచుకట్టు స్థలమునకుక్రింద 32 అంశములును, ఆస్థలముపైకు మీాద 180 అంశములును మొత్తము 212 అంశములును ఉండును. అనగా ఈయంత్రముప్రకారము నీటి కెసరువచ్చుటకు 212 అంశములును, నీరు గడ్డకట్టుటకు 32 అంశములును ఉష్ణోగ్రత యుండును.

జ్వరమును కొల్చుటకు వైద్యులు ఒకచిన్న గాజుగొట్టమును ఉపయోగించుచున్నారు. అది ఫహారన్‌హీట్ కొలతలు గల యుష్ణతామాపకయంత్రము. దీనికి "వైద్యకోష్ణతామాపకము" (Clinical thermometer) అని పేరు. (85 వ పటము) మానవశరీరములో సాధారణముగా నెప్పుడును 98. 4

అంశములఉష్ణోగ్రత యుండును. అనగా రమారమి తొంబైయెనిమిదిన్నరఉండును. దీనికి "స్వాభావికోష్ణము" (Normal heat) అని పేరు. ఇంతకంటె ఉష్ణము హెచ్చినయెడల జ్వరము వచ్చినదని చెప్పుదురు. ఇంతకంటె వేడితగ్గినయెడల కాళ్ళు చేతులు చల్లపడినవి అని అందురు. జ్వరము కొల్చెడి యుష్ణతామాపకముమీాద 95 అంశముల్కు మొదలు 111 అంశములవరకు గుర్తులు వేయబడి యుండును.



85 వ పటము.

వైద్యకోష్ణతామాపకమునందలి విశేషాంశ మేమన:— లావుగనుండు మొదటిభాగము(Bulb) యొక్క పైవైపుననుండు సన్నని గొట్టము (Capillary tube) యొక్క మెడ మిక్కిలి సన్నముగ నొక్కుకొని పోయియుండును. పాదరసము వేడియెక్కినప్పుడు ఈ సన్నని మెడగుండ పైకినెక్కును గాని చల్లారినప్పుడు క్రిందికి దిగదు. ఒకరోగియొక్క జ్వరమును కొలిచిన మాపకమును ఒకచోట కదలకుండ నుంచినయెడల ఆ మాపకము ఎల్లప్పుడును అదే అంశమును సూచించుచుండును. ఒకానొకరోగియొక్క జ్వరము మనము కొల్చినప్పుడు 105 'ఫ'అంశములున్న దనుకొనుము. ఈ మాపకము నెమ్మదిగతీసి ఎంతసేపు

మనము దాచి పెట్టినను అది 105'ఫ' అంశములనే సూచించు చుండును. దానిని తిరిగి ఉపయోగించుకొనుటకై దింపవలె ననిన యెడల లావుగ నుండుభాగము క్రిందినైపున నుంచి మాపకమును చేత పట్టుకొని పైభాగమునందలి పాదరసము క్రిందికి దిగునట్లుగా చేతిని ఝాడించవలెను. అప్పుడు పాదరసము మెడక్రిందికి దిగును. పిమ్మట తిరిగి దానిని ఉపయోగింపవచ్చును.

ఈక్రిందిపటములో అధికతమ, అల్పతమ ఉష్ణతామాపకములు జూపబడినవి. ఇవి ఒకదినమునందు కలిగిన అధిక, అల్ప ఉష్ణోగ్రతలను సూచించును. పైది అధికఉష్ణమును క్రిందిది అల్ప ఉష్ణమును తెలియజేయును.

86 వ పటము.




కొన్ని దేశములలో గొట్టముమీది "ఎసరుస్థలము"నకును మంచు కట్టు స్థలమునకును నడుమగల యంతరమును 80 అంశములుగా విభజింతురు.

ఈ పుస్తకమునందు సాధారణముగా 'శతవిభాగి" ననుసరించియే యుష్ణతామానము చెప్పబడును.

—: సామాన్యనియమమునకు నీళ్లొకయపవాదము :—

ఉష్ణతవలన పదార్థములు వ్యాకోచము పొందును; అనగా పెద్దవగును. శీతము(చలి) వలన పదార్థములు సంకోచము చెందును; అనగా చిన్నవగును. ఇది సామాన్య నియమము. ఈయంశము వెనుక చర్చింపబడినందున చదువరులు చక్కగ నెరుగుదురు. కానియీసామాన్యనియమము (General rule) నకు నొకయపవాదము కలదు. నీటికి శీతలము హెచ్చించినకొలదిని అది సంకోచము చెందును; అనగా దాని పరిమాణము తగ్గును. ఇట్లు, 4 అంశములవరకు తగ్గుచు పోయి, నీరుమంచుగడ్డకట్టు సమయమున మరల వ్యాకోచమును చెందును. అనగా నీటిని మంచు చేసిన మంచు పరిమాణము నీటికంటె ప్పుడు నెక్కువగును. పదిఘనపుటడుగుల నీరు మంచు క్రింద మారినప్పుడు, తక్కువగుటకు మారుగా, రమారమి 11 ఘనపు టడుగుల మంచుగడ్డయగును. అందుచేతనేమంచుగడ్డ నీళ్లలో తేలుచున్నది 87వ పటము చూడుము. కావున మంచుగడ్డయొక్క సాంద్రత తక్కువ యనియు నీటిసాంద్రత యెక్కువ యనియు మనము తెలిసికొనవలెను.



87 వ పటము.

నాలుగు అంశములకంటె వేడి తగ్గినప్పుడే నీళ్ళకు ఈ యపవాదనియమము వర్తించును. అంతకంటె వేడి యెక్కుడుండగానేని నీరు ఇతరపదార్థములవలెనే వేడిమివలన పరిమాణ వ్యాకోచము చెందును. వేడిమి తగ్గినపుడు పరిమాణ సంకోచము చెందును.

## ఉష్ణప్రచారము

సూర్యునినుండి మనకు వెలుతురు వేడిమియు వచ్చుచున్నవి. సూర్యునినుండి వేడిమి వచ్చునట్లే, దీపమునుండిగాని మంటనుండిగాని, ఉష్ణోదకము లోనగు ఇతరము లయిన, ఉష్ణపదార్థములనుండి గాని, ఉష్ణము అన్నిప్రక్కలకు ప్రసరించును. కనుకనే నెగడిచుట్టును కూర్చుండి యున్న అందరకును వేడిమి సోకును. వెల్తురు కిరణములుగా ప్రసరించునట్లే, వేడిమి గూడ కిరణములుగా ప్రసరించును. అయిన వేడిమి కిరణములు కంటికి కనబడక త్వగింద్రియమునకు మాత్రము గోచరించును.

ఇనుపగరిటెను, కర్రముక్కను, అగ్నిలో బెట్టి కొంచెము సేపటికి వాటి రెండవకొనలను తాకిన, మొదటిది వేడిగా నుండును; రెండవది యథాప్రకారముగానే యుండును. గరిటె చివర కొంచెము మైనము నంటించిన నది కరగి పడిపోవును. అగ్గిపుల్లను దానిచివరకు తాకించిన నది భగ్గునమండును. కర్ర చివర నిట్టివేమియు జరగవు. దీనికి కారణము, ఇనుముగుండ వేడిమి ప్రాకుటయు, కర్రగుండ ప్రాకలేక పోవుటయు దప్ప వేరు

లేదు. ఇనుమువలెనే, తక్కిన లోహము లన్నియుగూడ నుష్ణమును ప్రాకునట్లుచేయును. అట్టివానిని 'ఉష్ణవాహకము' (Conductors)లని చెప్పవచ్చును. కఱ్ఱ, రాయి, పలకముక్క, లక్క, గంధకము మొదలైనవాటిగుండ ఉష్ణము ప్రాకలేదు. కనుకనే యట్టివాటిని నిర్భయముగా చేతితోబట్టుకొని, రెండవ కొనను వేడి చేయవచ్చును. అవి 'అనుష్ణ వాహకములు'. 'ఉష్ణవాహకశక్తి' అన్ని పదార్థములయందును సమానముగా నుండదు. వెండిగరిటెను ఇనుపగరిటెను నిప్పులో బెట్టిన, మొదటిది రెండవదానికంటె త్వరగా వేడెక్కును. ఈవిషయమును చిన్న ప్రయోగమువలన బాగుగ గ్రహింపవచ్చును.

సమానమైన పొడుగును లావును గల వేరువేరు వస్తువుల కాడలను సంపాదించి, వాని కొనల నొకవైపున చేర్చి కట్ట గట్టి రెండవవైపు కొనలను దూరముగా నుండునట్లు చిన్న అట్టముక్కలో గాని బల్లచెక్కలో గాని అమర్చిపెట్టుము. విడిగానున్న వాని కొనలకు చిన్న మైనపుముక్కల నంటింపుము; తర్వాత, రెండవకొనలనుదీపముతో వేడిచేయుము.



88 వ పటము.

మైనపుముక్కలన్నియు నొకసారిగా పడక, ఒకటొకటిగ కరగిపడుట కారంభించును. అట్లు పడుటలో, ఉష్ణవాహకశక్తి

ఎక్కువగా నున్నవానియందు ముందుపడును. అనుష్ణవాహక పదార్థమునం దెప్పటికిని పడదు. త్వరగా బడుటనుబట్టి వాని శక్తిని గ్రహింపవచ్చును.

అన్నిలోహములలో, వెండికిని దానితరువాత రాగికిని ఉష్ణవాహకశక్తి హెచ్చు. అందుచేతనే మనయిండ్లలోని కాగుడుబిందెలు రాగితోనే చేయబడుచున్నవి. ఉష్ణవాహక శక్తి హెచ్చు గనుకనే మనము వంటసామగ్రికిగూడ లోహ పాత్రములనే యుపయోగింతుము.

రేగడిమట్టి యుష్ణవాహకము గాదు. అందుచేత నా మట్టితో చేయబడినకుండలుగూడ అనుష్ణవాహకములే. వానిని మనము వంటపాత్రలుగా నుపయోగించిన, నవి వేడెక్కుటకే చాలకాలము పట్టును. ఇకను, అందులోని వస్తువు పచన మగుటకు మిక్కిలికాలముపట్టును. ఏలయన వాటిలో ఉష్ణము త్వరగా ప్రాకనేరదు. అయితే వాటివలన నొకప్రయోజనము గలదు. అవి మనచేతికి తాకినప్పుడు, మన కంత వేడిమిపోకదు. ఇదిగాక నవి చౌక.

ఘనపదార్థములే గాక, ద్రవపదార్థములుగూడ ఉష్ణవా హకములు గావచ్చును. ద్రవపదార్థములలో పాదరసము మాత్రమే మంచి వాహకము; తక్కినవన్నియు సర్వసాధారణ ముగా అనుష్ణవాహకములు. నీరు ఉష్ణవాహకము గాదు. ఇందుకు ప్రయోగము.

కొంతనీటిని గొట్టములో బోసి, దానియుపరిభాగమునొద్ద నెంతసేపు వేడిచేసినను, క్రిందిభాగము వేడెక్కదు. పైభాగమందలి నీటిలోనుండి యావిరి వెడలుచుండినను క్రిందిభాగమునందలి నీరు చల్లగా నుండును. గొట్టములో క్రింద మంచుగడ్డ పెట్టినను అది కరగదు. 89 వ పటము చూడుము. దీనినిబట్టి నీటినుండి వేడిమి ప్రవహింప దని తెలియుచున్నది. అట్లుగాక, అది వాహకమై యున్నయెడల, సూర్యుని వేడికిరణములకు పాత్రములైన నదులయందలి, సముద్రములయందలి జలజంతువులు, మాడిపోవలసినదే. ఉపరిభాగమునందు వేడిమి యెంత హెచ్చుగా నున్నను, లోపల చల్లగా నుండుటచే



89 వ పటము.

నా జలాశయములు జంతువులకు ఎప్పుడును వాసయోగ్యములుగా నుండును.

అయిన, నీటిని మనము ప్రతిదినమును కాచుచుండుట లేదాయని ప్రశ్న వేయవచ్చును. అట్లు కాచునప్పుడెల్ల, నీటిక్రింద మంట వేయుదుము గాని, పైన మంట వేయము. క్రింద మంట పెట్టిన పైనీ రెట్లు వెచ్చనగును? నీరు అనుష్ణవాహకముగదా? అని అడుగవచ్చును. అట్లుక్రిందమంట వేయునపుడు, క్రింది నీరు వేడెక్కును. అందుచే నది వ్యాకోచము జెంది, తేలిక యగును. మీదనున్న చల్లనీరు బరువుగను, క్రిందనున్న వేడినీరు తేలికగను ఉండుటచే వేడినీరు ఉపరిభాగమునకు తేలును. మీద నున్న చల్లనీరు క్రిందికి వచ్చును. అది క్రింది యగ్నివలన వేడిమి జెంది, వెనుకటి దానివలెనే పైకి బోవును. పైనున్న నీరు క్రిందికి వచ్చును. ఇట్లు క్రమక్రమముగా నీరంతయు వేడెక్కును.


90 వ పటము.

ఈ విషయమును ప్రదర్శనమువలన జూపవచ్చును. గాజుగిన్నెలో నీరు బోసి, దానిలో కొంచెము రంపమ్ముతో కోయబడిన చెక్కపొట్టు వేయుము. ఆగిన్నె నిప్పుమీద బెట్టిన నీరు వేడెక్కిన కొలది రంపపుపొట్టుక్రిందినుండి పైకెక్కుచుండునట్లు కనబడును.

అనగా అందలి నీరు క్రిందినుండి వేడెక్కుటచే పైకి లేచు నని తెలియును.

ఇట్లు నీటిని క్రింద వేడిచేసినయెడల నందు క్రిందనుండి మీదికిని మీదినుండి క్రిందికిని పోవు కెరటములు పుట్టును. 90 వ పటము చూడుము. ఇందు పాత్రలోని నీరు క్రిందిభాగమున నట్టనడుమ వెచ్చచేయబడు చున్నది. అందుచే పాత్ర యొక్క నడిమిభాగమునుండి కెరటములు మీదికిపోయి పాత్ర యొక్క యంచుల వైపునుండి క్రిందికి వచ్చుచున్నవి. 91 వ పటము చూడుము. ఇందు నీరు ఒకవైపుననే వెచ్చ చేయబడుచున్నది. కావున ఆవైపున నీరు పైకెక్కుటయు, రెండవవైపు నుండి క్రిందికి దిగుటయు తటస్థించు చున్నది.



91 వ పటము.

ఇట్లు కెరటములు నీటియందే గాక, గాలిలో కూడ పుట్టును. చాల వేడి ప్రదేశముల యందలి గాలి వేడెక్కి తేలిక యగుటచే నాకాశమున కెక్కును. దాని ప్రదేశమునాక్రమించు

టకు, చల్లని ప్రదేశములనుండి, చల్లగాలి మొదటి చోటికి వచ్చును. ఆకాశమునకు బోయిన వేడిగాలి క్రమముగా చల్లబడి బరువెక్కి తిరిగి క్రిందికి వచ్చును. ఇట్లెప్పుడును, వేడిగాలి యాకాశమునకు బోవుటయు, చల్లగాలి వేడి ప్రదేశములకు చలిప్రదేశములనుండి ప్రవహించుటయు, జరగుచుండును. కనుకనే సముద్రమ్మునుండి చల్లనిగాలి ఎండవేళ వచ్చి ఎండతాపమును తగ్గించును. అట్లు గానియెడల ఉష్ణప్రదేశములయందలి జీవములు మలమల మాడి చావవలసినదే.

నీరు అనుష్ణవాహక పదార్థముగా నున్నందువలన కొక ప్రయోజనము గలదు. చలిప్రదేశములయందలి నీరు శీతకాలమున గడ్డ కట్టును. అట్లు గడ్డ కట్టునప్పుడు పైభాగము మాత్రమే గడ్డ కట్టి, నీరు అనుష్ణవాహకమై యుండుటచే, చలి లోపలికి ప్రాకక, లోపలినీ రెప్పుడును గడ్డకట్టుటకు వీలు లేక యుండును. లోపలి నీరు కూడ గడ్డకట్టినయెడల అందలి జంతువు లూపిరాడక చచ్చును. ఇదంతయు స్వాభావిక విశేషమే.

మంచుగడ్డ; మంచు; పొగమంచు;

మంచుబిందువులు; వడగండ్లు.

మనకు ప్రాణాధారమైన జలము ఉష్ణతాభేదములనుబట్టి అనేకరూపభేదములను దాల్చును. అందు ముఖ్యమైనవి, మంచు,

ఆవిరి. ఇది యందరకును దెలిసియే యుండుటచే వానినిగూర్చి వేరుగా జెప్ప నవసరము లేదు. కనుక తక్కిన రూపభేదములను గూర్చి నిందు కొద్దిగ జెప్పవలసియుండును.

మంచుగడ్డ:—భూమిమీద నున్న నీటికి చలిగాలిసోకిన నది గడ్డ కట్టిపోవును. అది ఉత్తర దక్షిణధ్రువములకు జేరు వను మిక్కుటముగా నుండును. రష్యాదేశపు టుత్తరభాగము లందు మంచుగడ్డ విస్తారముగా నుండుటచే, అక్కడివారు దాని మీద ప్రయాణము చేయుటగూడ తటస్థించును. దానిమీద సరుగుళ్లవలె నుండు చక్రములులేని బండ్లను లేళ్లచే లాగించు కొనుచు ప్రయాణము చేయుదురు. మంచుగడ్డను యంత్రసహాయ మువలనగూడ జేయవచ్చును. రైలుబండ్లలో నమ్మబడు మంచు గడ్డంతయు నిట్లు చేయబడినదే. నీటిని చల్లబరిచి గడ్డకట్టించెదరు.

(2) మంచు.—హిమాలయప్రాంతములు, మరికొన్ని పర్వత శిఖరములు మంచుతో గప్పబడియుండును. అయిన నది గడ్డకట్టిన మంచు కాదు. అది ఆకాశమునుండి ముద్దలుముద్దలుగా బడును. అది మెత్తగానుండి, చేతితో ముద్ద చేయుటకును, కొన్ని ముద్ద లనుగలిపి యొకటేముద్దగా జేయుటకునువీలగును. అట్టిమంచుతో శీతల దేశములందలి పిల్లలు మనము రేగడిమట్టితో బొమ్మలను జేసినట్లు బొమ్మలు మొదలైనవి చేసి యాడుకొందురు. వారు విలాసార్థము మంచుతో పెద్దమనుష్యాకారముగల బొమ్మలను జేయుదు రని, ఇండ్లు కట్టుదు రని పుస్తకములయందు జదువు చుందుము.

(3) పొగమంచు.—ఆకాశమున మేఘరూపముననున్న సూక్ష్మజలకణములు, చలిగాలి సోకినప్పుడు వర్షబిందువులుగా మారి భూమిమీద వర్షించును. ఆకాశమం దంతట నీటియావిరి యలముకొని యుండును. శీతకాలమునందును వర్షకాలమునందో క్కొకప్పుడును, చలిగాలి సోకుటచే, ఆవిరంతయు సూక్ష్మజలకణములుగా మారి, ఆకాశమునకు పొగవలె క్రమ్ముకొనును. దానినే పొగమం చందురు.

(4) హిమ బిందువులు.—శీతకాలమున ఉదయమున చెట్లనుండియు ఇండ్లనుండియు జలబిందువులు పడుచుండును. వానిమీద సూర్యరశ్మి పడినప్పు డవి వజ్రపుతునుకలవలె రంగురంగులుగా మెరయును. ఆకాశమునందలి యావిరి చలిగాలిచేతను, చల్లని ఘనపదార్థముల సంపర్కముచేతను, బిందురూపము వహించును. అవియే మంచుబిందువులు.

(5) వడగండ్లు.—ఆకాశమునందలి మేఘములకు, హఠాత్తుగా చల్లనిగాలి సోకి, నీటిబిందువులు గడ్డకట్టి, వడగండ్లుగా వర్షించును. వానిని మనము కొంచెము సేపుంచిన నవి నీరై పోవును.

మనకు సాధారణముగా మంచుగడ్డకంటె చల్లనివస్తువులుండవని యభిప్రాయముండును. మంచునుగాని వడగండ్లనుగాని గిన్నెలో వేసియుష్ణతామాపకమును బెట్టిన, 0 అంశము వరకు పాదరసము దిగును. సున్నయొద్దకువచ్చి యాగిపోవును. ఆ మంచుతో కొంచెము ఉప్పును కలిపిన ఉష్ణోగ్రత సున్న

కంటె క్రిందికి దిగును; దీనినిబట్టి మంచుగడ్డకంటె చల్లని పదార్థములుగూడ నుండవచ్చు నని తెలియుచున్నది.

నీరు, 100 అంశముల యుష్ణోగ్రతను జెందినప్పుడు, ఆవిరిగా మారునని మనము దెలిసికొంటిమి. అయిన నానీరు శుభ్రముగ నున్నప్పుడే యట్లు జరుగును. దానిలో ఉప్పు మొదలైన పదార్థములు కలిసిన, 100 భాగములకంటె హెచ్చు ఉష్ణోగ్రత జెందినగాని, అందుండి యావిరి వెలువడదు. ఆ వెలువడిన యావిరి యుష్ణోగ్రత మాత్రము 100 భాగములుగానే యుండును.

నీటికి ఎసరువచ్చునప్పటి యుష్ణోగ్రత, అం దితరపదార్థములు కలిసియుండుటను బట్టియే గాక, దానిమీద నుండు వాయుపీడనమును బట్టికూడ నుండును. పర్వతశిఖరములమీద నీటికి 100 అంశముల క్రిందనే ఎసరువచ్చును. దానికి కారణము అక్కడ వాయుపీడనము తక్కువగా నుండుటయే. లోతైన గనులలో దానికి 100 అంశములకు పైనిగాని ఎసరు రాదు. ఈవిషయమును ప్రయోగమువలన జూపవచ్చును.

ఒక సన్నని మూతిగల గాజుబుడ్డిలో నీరు కొంతవరకు బోసి, క్రింద మంటబెట్టుము. నీరుపొంగి యావిరగుట కారంభించి, ఆయావిరి దానినుండి పైకివచ్చుచున్నట్లు కనబడిన తర్వాత దానికి గట్టిగా బిరడ బెట్టుము.

ఇప్పుడు దానిని బోర్లించి, దానిమీద చన్నీళ్లు బోయుము. 92 వ పటము చూడుము. అట్లు పోయుటవలన, నీటిలోనుండి బుడగలు తిరిగి వచ్చును. కాబట్టిదానినుండి తిరిగి యావిరి వచ్చు చున్నదని తెలిసికొన వచ్చును. ఇప్పుడు దానియుష్ణోగ్రత 100 కంటె తక్కువగా నుండును. అనగా 100 కంటె తక్కువయుష్ణోగ్రతలో గూడ ఎసరువచ్చునని తెలియుచున్నది.



92 వ పటము.

గాజుబుడ్డిని తలక్రిందు జేసినప్పుడు, అందలి శూన్యప్రదేశము ఆవిరిచే నాక్రమింపబడి యుండును. దానిమీద నీరు పోసినప్పుడు ఆవిరి చల్లబడి నీరగును. అట్లాయావిరి నీరగుటచే, నక్కడ శూన్యప్రదేశ మేర్పడుటవలన, నీటి మీద పీడనము తగ్గును. పీడనము తగ్గుటవలన, నీరు తిరిగి యావిరగును. కాబట్టి నీటిని ఆవిరిగా మార్చుటయందు దాని యుపరిభాగముమీది పీడనము శక్తిని వహించియుండు నని తెలియును.

## ఆవిరి యంత్రములు

ఉష్ణత యనునది యొకమహాశక్తి. దీనిని మనము స్వాధీనములో నుంచుకొనినయెడల దానిచే కొండను పిండిచేయింపవచ్చును; వాయువేగముతో నొకచోటునుండి మఱియొక చోటికి ప్రయాణము చేయవచ్చును; మనుష్యులకు గావలసిన వస్త్రాదులు దినమునకు కోట్లకొలది నేయింపవచ్చును. ఉష్ణమునకు గల యీ గుణమును తెలిసికొని శాస్త్రజ్ఞులు కొన్ని యంత్రములను నిర్మించిరి. ఆవిరిబలముచే నడుచుచున్న రైలు బండియు, పొగయోడలును, బట్టలు నేయు యంత్రములును మనము చూచుచున్నారము. వీనికన్నిటికిని ఆవిరియంత్రములని పేరు. ఈ చిన్నగ్రంథములో వానినన్నిటిని వర్ణించుటకు వీలులేదు. ఇవన్నియు నేయంత్రమువలన నడుచునో యట్టిది యొకటి వర్ణించిన చాలును.

వ్రేలియుంగర మంత గుండ్రముగా నుండు గాజుగొట్టము తీసికొని యందు నాలుగుబొట్లు నీళ్లుపోసి యాగొట్టమును బిరడతో మూయుము. తరువాత నాగొట్టమును వెచ్చ చేసినయెడల పెద్దధ్వని చేసి యాబిరడ యెగిరిపోవును. అట్లది యెగురుటయేల? గొట్టములోని నీరు ఆవిరియై వ్యాకోచమును చెంది, తనకుండుటకు ఆచిన్నస్థలము చాలక, బిరడను ఎగుర గొట్టుకొని యావలపడును. అన్న ముడుకుచున్న గిన్నెమీద పెట్టిన సిబ్బి క్రిందపడుట అందరెరిగినదియే. ఇట్లు నీరు ఆవి

రమై వ్యాకోచమును చెందినప్పుడు దానికి మిక్కిలి బలము గలిగి, దానితో సంబంధముగల యితరవస్తువులకు చలనము (Motion) కల్పించుచునని స్పష్టపడుచున్నది.

ఈ సిద్ధాంతము ననుసరించియే యీక్రింది యావిరియంత్రము చేయబడినది.

ఆవిరియంత్రముయొక్క నిర్మాణము.

93 వ పటము చూడుము. ఇందు 'క' అనునది యొక నీళ్లకాగు (Boiler.) ఇందు నీళ్లుండును. దీనిక్రింద నిప్పు వేసి నీళ్ళు వెచ్చచేయుదురు. ఇందులో నీళ్లు బాగుగ కాగి యావిరి యగును. అది కాగుతో కలిసి యున్న సన్నగొట్టములోనుండి '$చ_1$ $చ_2$' అను గొట్టములలోనికి పో




93 వ పటము

వును. కుడిచేతివైపు గొట్టమునకు క్రిందనుమీదను '$చ_1$' '$చ_2$' మరలుగలవు. ఇవి యొకవైపు త్రిప్పినయెడల గొట్టములోనికి ఆవిరి పోదు. ఇంకొకవైపునకు త్రిప్పినయెడల గొట్టములోనికి

ఆవిరి పోవును. 1,2,3,4 అంకెలుగుర్తుగాగలది యొకస్థాపము (Cylinder) అనగా గుండ్రని పెద్దగొట్టము. కాగులోని యావిరి యేగొట్టము ద్వారా పోవునో యాగొట్టము మీది భాగమందు "$చ_1$" అనుచోటను, క్రిందిభాగమందు "$చ_2$" అనుచోటను, ఈ స్థాపములో కలుపబడియున్నది. స్థాపములో నొక "ముసలకము దాని నంటి ముసలదండమును గలవు. "$చ_1$' అనుమార్గము 'ముసలకము' నకు మీదను, '$చ_2$' అనుమార్గము "ముసలకము" నకు క్రిందను ఉన్నవి. స్థాపమునకు నెడమప్రక్కను ఇట్టిమార్గములే "$చ_3$" "$చ_4$" అనునవి కలవు.

క్రిందనున్న '$చ_2$' ద్వారమును మూసి మీది '$చ_1$' ద్వారమును తెరువుము. అందుచే కాగులోని యావిరి '$చ_1$' మార్గమున స్థాపములోనికి ప్రవేశించి ముసలకమును క్రిందికి త్రోయును. ఇక మీది '$చ_1$' ద్వారము మూసి క్రిందనున్న "$చ_2$" ద్వారము తెరువుము. క్రిందినుండి యావిరి స్థాపములో ప్రవేశించి ముసలకమును పైకిత్రోయును. ముసలకముమీద నున్న యావిరి ప్రక్కనున్న "$చ_3$" ద్వారము తెరచియుంచి నందుచే అందుండి వెలువడును. ముసలక మిట్లు మీదికి పోవును. మరల '$చ_2$" మూసి '$చ_1$' తెరచిన ముసలకముక్రిందికి వచ్చును. ఈ తడవ ముసలకము క్రిందనున్న యావిరి వెలుపలికి వెడలిపోవుటకు '$చ_4$' ద్వారము తెరచి యుండవలెను.

ఇట్లు ముసలకము క్రిందికిమీదికితిరుగుచుండును. అనగా దానికి అతిశీఘ్రమైన చలనము (Motion) కలుగును. పైనివర్ణింపబడిన ద్వారములను మూయుట తెరచుట మనుష్యులు చేతితో చేయవలయుననిన చాలకాలము పట్టును. విశేషమైనపని జరుగదు. కావున ఆవిరియంత్ర సాహాయ్యముననే మూయునట్లును తెరచునట్లును ఏర్పాటు చేయబడియుండును. అందుచే ముసలకము, దాని దండము మిక్కిలి వేగముతో తిరుగుచుండును.

ముసలదండ మిట్లు మహావేగముతో క్రిందికి మీదికి తిరుగుచున్నందున, దానికిని ఇంకొక పదార్థమునకును సంపర్కమును కలుగజేసినయెడల నా రెండవపదార్థమునకు గూడ నీ మహావేగము కలుగును. రైలుబండిలోని యింజనుయొక్క యిరుసునకు ఈ దండమునకు సంబంధము కలుగునట్లు చేయుదురు. అందుచే నది మహావేగముతో తిరుగును. కావున దానికి తగిలియున్న చక్రములు మిక్కిలి వేగముతో పరుగిడును. బట్టలునేయుయంత్రశాలలో ఈముసలదండమునకును ఒకపెద్ద చక్రమునకును సంబంధముండును. అందుచే నాచక్రము మహావేగముతో తిరుగుచుండును. ఆ చక్రముయొక్క వేగమును చిన్నచిన్న చక్రముల ద్వారా పంచుకొని ప్రత్తియేకుట కొక చిన్నచక్రపు వేగమును, దారమువడుకుటకు మరియొక చిన్న చక్రముయొక్క వేగమును, బట్ట నేయుటకు ఇంకొకచక్రముయొక్క వేగమును ఉపయోగించుకొనియెదరు.

---

# అనుబంధము

పరిశుభ్రమైన నీటికెప్పుడును 100. శ. అంశములవద్దనే ఎసరు వచ్చు నని మనము తెలిసికొంటిమి. ఈ ఎసరు స్థలము నీటికేకాక, అన్నిద్రవములకును స్వాభావనియమితముగా నుండును. పాదరసమునకు 360° శతవిభాగియంశములవద్దను, సారాయికి 78°. శ. వద్దను ఎసరువచ్చును. ద్రవములకు ఎసరుస్థలము నియమితముగా నుండుటచేత, నవి పరిశుభ్రమైనవా కావో నిర్ణయింపవచ్చును. నీరు 100°. శ. దగ్గర పొంగనియెడల నది శుభ్రమైనది గాదని చెప్పవచ్చును.

నీటికి నియమితమైన ఎసరుస్థల ముండుటవలన ఒక ప్రయోజనము గలదు. మనమేదైనవస్తువును 100°. శ. యుష్ణోగ్రతయందు కొంతకాలముంచవలెననిన, దానిని ఆవిరిమీద వేడిచేయవచ్చును. ఆవిరియొక్క యుష్ణోగ్రత ఎప్పుడును ఒకటిగానే యుండుటచేతనే నిట్టిపని సాధ్యమగుచున్నది. దీని యుపయోగము "వాసెనకుడుము" తయారుచేయుట చూచినవారికి చక్కగా బోధపడ గలదు. వాసెనకుడుము అన్నిభాగముల యందును ఒకేవిధముగా కాలును. అది మాడిపోవుటఎన్నటికిని తటస్థించదు. మూకుడులో గాని, పెనముమీదగాని కాల్చిన రొట్టె అన్నిభాగములయందును సమానముగా కాలుటకు వీలులేదు. అందువలననే నడుగుభాగము సాధారణముగా మాడును.

కొన్ని సమయములయందు నీటిని వేడిచేయుటకు ప్రారంభించినవెంటనే కొద్దిగా బుడగలు వచ్చును. దాని యుష్ణోగ్రత జూచిన 50. శ. కంటెను తక్కువగానుండును. అందుచేత నది ఎసరుస్థలమునకు వచ్చెన దని చెప్పుటకు వీలులేదుగదా ! ఇక బుడగలు వచ్చుటకు కారణమేమై యుండును ? నీళ్ళలో సాధారణముగా గాలి మిశ్రితమై యుండును. నీటిని కాచినప్పుడు ఆగాలి తరిమి వేయబడును. మొదట గానవచ్చిన బుడగలు ఈ గాలిబుగ్గలే.

కాచిననీరు, కాచనినీ రంత రుచికరముగా నుండదు. దీనికి కారణ మందలిగాలి యెగిరిపోవుటయే. నీటిని కాచి తిరిగి చల్లార్చినయెడల నందు గాలి తిరిగి మిశ్రితమై మొదటిరుచిని గ్రహించును.

మనము ప్రతిదినమును త్రాగుటకును, వంటకును ఉపయోగించునీటిలో కొన్ని మలినపదార్థము లుండుట సహజము. ఈ మలిన పదార్థములు ఆ నీరు ప్రవహించుప్రదేశముల కల్మషస్థితిని బట్టియుండును. నీటిలోనుండు మలినపదార్థములను రెండు విధములుగా విభజింపవచ్చును. మొదటివి, సుద్ద, ఉప్పులు, ప్రాణవాయువు, బొగ్గుపులుసుగాలి లోనగు వాయువులు. ఇవి సాధారణముగా శరీరమునకు హానిజేయునవి గావు. అదిగాక ఇందులో కొన్ని నోటికి రుచిని కలిగించి శరీరమునకు మేలు గూడ జేయును. ఉదాహరణము: ప్రాణవాయువు నీటికి రుచి

నిచ్చును. బొగ్గుపులుసు గాలి ఆహారమును జీర్ణింపజేయును. రెండవవిధమైన మలినము, మిక్కిలి సూక్ష్మరూపమున నున్న వృక్షములయొక్కయు, జంతువుల యొక్కయు భాగములు. ఈరెంటికిని సాధారణముగా క్రుళ్లెడు స్వభావముగలదు. ఇవి నీటిలో కలిసి క్రుళ్లినప్పుడు శరీరమునకు మిక్కిలి యనారోగ్యకరములు. కావున అట్టినీటిని వర్జింపవలెను. నిర్మలమైన నీరు దొరకనప్పుడు ఆనీటిని బాగా కాచికొని చల్లారబెట్టి త్రాగవలెను. అట్లు మరగకాచుటవలన నందలి వృక్షజంతుభాగములు కాకను ఆగలేక రాసాయనిక పరిణామమునుబొంది నిర్జీవములై మనశరీరమునకు హానిచేయలేనట్టి స్థితికి మారును. అప్పుడవి మన శరీరములో చొచ్చినను బాధకరములు గానేరవు.

ఇట్లు అనారోగ్యకరము లగు వస్తువులను నీటియందు లేకుండునట్లు జేయుటకే చాలయూళ్ళయందు నీటిగొట్టములను పెట్టి వాటి మూలమున ప్రజలకు శుభ్రమైన నీరు నిచ్చుటకు ప్రయత్నములు జరుగుచున్నవి.

మనము త్రాగునీరేగాక తినుపదార్థములుగూడ శుభ్రములుగా నుండవలెను. అట్లుజేయుటకే మనమువాటిని పచనము చేయుదుము. అనగా నిప్పుతో కాచి వంటచేయుదుము. పచనము చేయబడిన యాహారముకంటె పచ్చియాహార మెక్కువ యనారోగ్యకరము.

వైద్యులు శస్త్రము చేయునప్పుడు తమసాధనములను కళకళకాగుచున్న నీటిలో వేయుదురు. దానికి కారణము మలిన పదార్థములను వాటినుండి తొలగించుటయే. అవియుండిన యెడల నవిరోగియొక్క శరీరములోజొచ్చి ప్రాణాపాయమును గూడ కలిగించవచ్చును. ఇదిగాక సర్వరోగములకు మూల మైన సూక్ష్మజీవులను నాశనముచేయుట కూడ నీటిని మరగ బెట్టుటయందలి యభిప్రాయము.

—:మిక్కిలి పరిశుభ్ర మైననీటిని జేయువిధము:—

కాచిననీరు త్రాగుట కుపయోగించినను, రాసాయనిక క్రియల యందుపయోగించుట కెంతమాత్రమును పనికిరాదు. ఆ క్రియ లకు మిక్కిలి పరిశుభ్ర మైననీరు గావలెను. వర్షపు నీరు శుభ్ర మైనదైనను, దానిలో కొన్ని వాయువులుకలియుటచేపనికిరాదు.

ఏవిధమైన మలినమును లేని నీటిని తయారుచేయుటకు ఒక "జలయంత్రము" కావలెను. అందలి ముఖ్యభాగములు రెండు. ఒకటి నీటినికాచుపాత్ర; రెండవది దానినుండి వచ్చు యావిరిని కూడబెట్టునట్టి పాత్ర. ఈ రెండవపాత్రను చల్లగా నుంచినయెడల దానిలోనికి వచ్చునావిరి యెప్పటికప్పుడు నీరై యుండు కూడును. ఈయంత్రమును స్వల్పముగా రెండు గాజు పాత్రములతో నమర్చి ఈక్రియను జూప వచ్చును.

94 పటమునందు, 'అ' తోక గలగాజుపాత్ర. ఇందులో నీరు పోసి క్రింద దీపముగాని మంటగాని పెట్టి నీటిని ఎసరువచ్చునట్లు కాచవలెను. ఈ పాత్రయొక్క తోక రెండవపాత్రలోనికి నడు




94-వ పటము.

వ్వబడును. దీనినుండి వెలువడు ఆవిరి రెండవ దానిలో కూడి "ఉ" నుండి సంతతధారగా బడు చల్లనినీటిచే నీరయిపోవును. ఈ నీరు మిక్కిలి పరిశుభ్రమైనది.

ఈ క్రియకు "స్రావము" అని పేరు. వర్షమొక స్వభావ సిద్ధమైన "స్రవ" క్రియ యని చెప్పనచ్చును. ఈ క్రియ నేసారాయి మొదలగు వాటిని దింపుట కుపయోగించుదురు.

సముద్రముమీద ప్రయాణము చేయువారికి యీవిధమున సముద్రపు నీటినుండి మంచినీటిని తయారుచేసికొనుట అత్యంత యవసరమై యుండును. అందుచేత ఓడలలో నిట్టి యంత్రములు పెద్దవి నిర్మింపబడి యుండును.

ద్రవములు ఇగిరిపోవునపుడు చల్లదనమును పుట్టించును.

మనము వేసవికాలమునందు మంటికుండలయందు నీటిని పోసి త్రాగుట కుపయోగింతుము. లోహపుబిందె లంతగా నుపయోగించ కుండుటకు కారణమేమి? మంటిపాత్రలలోని నీరు ఎక్కువ చల్లగా నుండు నని మనకు దెలియును. మంటిపాత్రల యందు మిక్కిలి సూక్ష్మములైన రంధ్రము లనేకము లుండును. ఆ రంధ్రములగుండా నీరు పైకుబికి గాలితో సంఘట్టనము జెందినప్పుడు ఆవిరిరూపమైఎగిరిపోవును. ఆవిరగుటకు కావలసిన వేడిమి కుండనుండియే తీసికొనుటచే నందలి నీరు అంతకంతకు చల్లబడును. లోహపాత్రలలో నిట్టిపని జరుగుటకు వీలు లేదు గాన నందలినీరు అంతగా చల్లబడదు. అట్టిపాత్రలలోని నీటిని గూడ చల్లగా జేయుటకు వాటిపైన తడిగుడ్డలను గట్టుదుము. తడి ఆరినవెంటనే తిరిగి గుడ్డను తడుపుదుము. అట్లు చేయుట వలన లోపలినీటిలోని వేడిమి కొంత హరించి, నీరు చల్లనగును.

నీటికంటె త్వరితముగా నిగిరిపోవు ద్రవము లుపయోగించిన, నింతకంటెను త్వరితముగా చల్లదనమును పుట్టింపవచ్చును. సారాయిబొట్టు మనచేతిమీద బడినయెడల నక్కడ మిక్కిలి చల్లబడును. దీనికి కారణము, సారాయి ఇగిరిపోవునప్పుడు చేతిలోని ఉష్ణమును హరించును. ఇట్లే "ఈతరు" అను ద్రవముకూడ త్వరగా నిగురుటచే ఏ పదార్థమునందలి ఉష్ణము

నైన హరింపగలదు. దీని సహాయము వలన నీటిని మంచు కట్టింపవచ్చును.

కొన్ని యుపయోగమైన స్వల్పక్రియలు

నీటిని శుభ్రపరుచునట్టి క్రియయొకటి ఇదివరకే చెప్పబడినది. కొన్ని సమయముల యందు మనము త్రాగెడు నీటిలో నలకలు మట్టి మొదలైనవి కలిసియుండును. అట్టి నీటిని కొంతసేపు కదలకయుండునట్లు నొకచోటనుంచిన నవి అడుగునకుదిగి పోయి, నీరు పైకి తేరును. ఆ తేరిన నీరును మనము జాగ్రతగా గ్రహించవలెను. ఈ క్రియకు 'తేర్చుట' యని పేరు.

నీటిలోని మడ్డి మిక్కిలిసన్ననిదై, దానంతటది త్వరగా క్రిందికి దిగనియెడల మనము చిల్ల (ఇండుప) గింజ నరగదీసి దానితో కలుపుదుము. లేదా పటికి పొడుమును గూడ వేయవచ్చును. అప్పుడు మడ్డి త్వరగాదిగి నీరు తేరును.

నీటిలోని నలకలనుగాని, నేతిలోని చీమలనుగాని వేరు చేయుటకు మనము సాధారణముగా గుడ్డతో "వడ" బోయుదుము. వడపోతను గుడ్డతోగాక, ఒకవిధమైన అద్దుకాగితము వంటి వడపోత కాగితముతో గూడచేయవచ్చును. ఈ క్రియకు కావలసిన పనిముట్లు ఒక గరాటి, వడపోత కాగితములు. వడపోతకాగితమును మడిచి గరాటిలో బెట్టి అందులో మలినమైన నీరు పోసిన, నలకలు లేనినీరు, గరాటి తోకగుండా చుక్కలు చుక్కలుగా క్రింది గిన్నెలోకిపడును. 95 వ పటముచూడుము.





95-వ పటము.

ద్రావణము:- ఇసుక పంచదారలోగాని, బొగ్గుపొడి ఉప్పులోగాని కలిసిన, వానిని విడదీయుటకు, మొదట వాటిని నీటిలో వేయవలెను. అప్పుడు పంచదార, ఉప్పు నీటిలో కరగును. ఇసుక, బొగ్గుపొడి నీటిలో కలియకయుండును. అప్పుడు ఆనీటిని వడపోసిన, శుద్ధద్రావణము క్రిందికి దిగును. దాని నెండబెట్టిన ఉప్పు, పంచదార నిలచి నీరెగిరిపోవును. ఈక్రియకు ద్రావణక్రియయని పేరు.

నీటిలో కొంచెము ఉప్పువేసిన నది కరగిపోవును. మరి కొంచెము వేసిన నదికూడ కరగవచ్చును. ఇట్లు కొంచెము కొం

చెముగా చేర్చుచుబోయిన కొంచెము నీపటికి వేసిన ఉప్పు కరగక అట్లే నిలిచిపోవును. అప్పుడు ఆనీటికి ద్రావణశక్తి పరిపూర్తియైన దని మనము గ్రహించవలెను. దానికి "పరిపూర్ణ ద్రావణము" అనిపేరు.

ఇప్పుడు మరికొంచెము ఉప్పువేసి నీటినికాచిన, ఆ ఉప్పు కరగి మాయ మగును. దీనినిబట్టి వేడిచేసినప్పుడు నీటికి ద్రావణ శక్తి హెచ్చునని తెలియునది.

ఆ నీరు తిరిగి చల్లబడినప్పుడు హెచ్చుగా తీసికొనిన ఉప్పును వెడల గ్రక్కును. ఆ ఉప్పు చిన్న స్ఫటికములరూపమును ధరించి పాత్రయొక్క ప్రక్కల నంటుకొనును. ఆక్రియకు "స్ఫటికీకరణము" అని పేరు. ప్రతివస్తువునకును నియమిత స్ఫటికాకారము గలదు. ఆ యాకారమునుబట్టి ఆవస్తువును గుర్తింప వచ్చును.


96 వ పటము.

96వ పటములో పటికయొక్క స్ఫటికము చూపబడినది. రెండువస్తువులు కలిసి నీటిలోకరగియున్నప్పుడు, ఆనీటిని నెమ్మదిగా నిగురనిచ్చిన, ఆరెండువస్తువులు వేరువేరు స్ఫటికాకృతితో వెలువడును. వాని యాకారమునుబట్టి యారెంటిని వేరు చేయవచ్చును.

ఉప్పు సముద్రపునీటినుండి తయారుచేయబడును. పొలము చిన్నచిన్న మళ్లుగాకట్టి, ఆమళ్లలోనికి సముద్రపు నీటిని

త్రోడుదురు. ఎండవేడిమికి నానీరంతయు నిగిరి, లవణ స్ఫటిక ములు మడిలో నిలుచును. వాటిని ప్రోగుచేసి జాగ్రతబెట్టుదురు. ఇట్టి లవణమును ఎన్నూరు, కాకినాడ, మంగినపూడి, మొదలగు ఊళ్లయందు తయారు చేయుదురు. కొన్ని ప్రదేశములయందు గనులలో నుప్పు దొరకును. అట్టిగనులు రాజపుతానా బంగాళాదేశములందు గలవు.

బెల్లమును, పంచదారయు గూడ నీక్రియవలననే చేయుదురు. చెరకురసమును దీసి దానిని వండిన బెల్లమగును. ఆ రసమును శుభ్రపరచి స్ఫటికీకరించిన పంచదార యగును. బెల్లములోని రంగును దీసివేయుటకు దానిని ఎముకల బొగ్గుగుండా వడపోయుదురు. పంచదారచేయు యంత్రశాల చామర్లకోటలో గలదు.

వాయువు:—

సమస్త జంతుకోటికిని ప్రాణాధారమైనది వాయువు. వాయురాహిత్యమైన ప్రదేశమునందు జంతువులు నివసించుటకు వీలులేదు. మనుష్య శరీరము యొక్క ఆరోగ్యము వాయువును పీల్చుటవలననే నిలబడుచున్నది. మనము గాలిని ముక్కు రంధ్రములగుండా లోపలికి పీల్చినప్పుడు, అది ఊపిరితిత్తులలోని సన్నని రక్తనాళములలోనికి బోయి, అక్కడ తన ప్రాణవాయువును రక్తమునకిచ్చి, రక్తమునందలి మలిన పదార్థమగు బొగ్గుపులుసుగాలిని తానుతీసికొని, తిరిగి నిశ్వాసము

నందు బయటికివచ్చును. ఇట్లు రక్తమునందలి మలిన పదార్థము తీసివేయబడి, ప్రాణవాయువు చేర్పబడనియెడల శరీరము అనారోగ్యమును జెంది ప్రాణాపాయము రావచ్చును.

ప్రాణమునకు వాయు వెంతయవసరమో, దీపము వెలుగుటకు కూడ నదియంతే యవసరము. వాయుప్రచారము లేనిచోట దీపమారిపోవును. దీనిని ప్రయోగమువలన చూపనగును. ఒక సన్ననిమూతిగల గాజు సీసాలో దీపమునుపెట్టి ఏమగునోచూతుము. ఆదీపము అంతకంతకు తగ్గి స్వల్పకాలములోనే యారిపోవును. ఏల యారిపోయిన దనిన, నందు గాలి లేకుండుటచే నారిపోయిన దని చెప్పవచ్చును.


97 వ పటము.

కొంతసేపు వెలుగుటకు కారణమేమి? గాలి యున్నంతసేపు వెలిగి తరువాత నారిపోయినది. ఆగాలిఏమైనది? ఆబుడ్డిలో కొంచెము సున్నపునీటిని పోసిన నది తెల్లబడును. ఆ నీరు గాలి యున్నప్పుడు అట్లు తెల్లబడదు. అందుచేత దీపము వెలిగించుటవలన నందలి గాలికి యొకమార్పు కలిగె నని చెప్పవచ్చును. దీపములోని చమురు, గాలిలోని ప్రాణవాయువుతో రసాయన సంయోగము జెందును. ఆ సంయోగమే దీపము వెలుగుటయని గ్రహించవలెను. ప్రాణవాయువు అయిపోవుటచేతనే దీపము ఆరిపోయినది. దీపము వెలిగినందువల్ల వచ్చినగాలి బొగ్గుపులుసు

గాలి యనబడును. ఇది చమురునందలి, బొగ్గును, గాలియందలి ప్రాణవాయువును సంయోగము చెంది ఏర్పడుచున్నది. దీనికే సున్నపునీటిని తెల్లబరచు గుణము గలదు.

ఈప్రయోగము వలన గాలిలో ప్రాణవాయువుగలదని తేలినది. అందు ఇంకేమైన గలదా? మరియొక ప్రయోగము చేయవలెను.

ఒక గాజుబుడ్డిని తెచ్చి దానిలోపల కొంచెము తడిచేసి సన్నని ఇనుపపొట్టును చల్లుము. తరువాత ఆబుడ్డియొక్క మూతిని, తలక్రిందుచేసి నీటిలో మునుగునట్లుపెట్టి కొన్నిగంటలుంచుము. అప్పుడు క్రమక్రమముగా నీరు బుడ్డిలోనికెక్కి కొంతవరకువచ్చి ఆగును. దీనికి కారణము ఇనుము ప్రాణవాయువును తీసికొని త్రుప్పుగామారినది. ఆప్రాణవాయువుయొక్క స్థలము నాక్రమించుటకే నీరు పైకెక్కినది.

బుడ్డినిండ నీరేల యెక్కలేదు? మిగిలిన స్థలమునందు మరియొకటి ఏదోయుండవలెను. ఇప్పుడు ఆ బుడ్డిని సరిగాత్రిప్పి అందులో వెలుగుచున్న దీపమును బెట్టిన నది వెలుగక యారి పోవును. కాబట్టి మిగిలినగాలి దీపమును ఆర్పివేయును. అందులో సున్నపునీటినిబోసిన నవి తెల్లబడవు. కాబట్టి అది బొగ్గుపులుసుగాలి గాదు. మరియేది? దీపమును వెలుగనియ్యక సున్నపునీటిని తెల్లగాజేయు దీనికి "నత్రజని" యని పేరు.

కాబట్టి గాలిలో ప్రాణవాయువు (అమ్లజని), నత్రజని యను రెండువాయుపదార్థములు గలవని తెలిసికొంటిమి. 1 ఘనపరిమాణముగల ప్రాణవాయువుతో, 4 ఘన పరిమాణముల నత్రజని, కలిసి వాయువేర్పడు చున్నది.




98వ పటము.

ఈ ప్రయోగమునే మరొకవిధమున గూడ చూపవచ్చును. ఒకవైపు మూయబడిన గాజు గొట్టమును సంపాదించి దానిలో నొకశనగగింజంత "స్ఫురవు" ముక్కను పడవైచి గట్టిగా బిరడబెట్టుము. కొంచెము సేపటికి స్ఫురము తనంతట తానే మండును. లేదా గొట్టమునుస్వల్పముగా వేడిచేయుము. అప్పుడు ఆస్ఫురము మండి గొట్టమునంతను తెల్లనిపొగతో నింపివేయును. మంట ఆరిపోవును. ఇప్పుడు ఆగొట్టమును తలక్రిందుగా నీటిలోముంచి బిరడతీసివేసిన నాపొగ మాయమై నీరుగొట్టములోనికి అయిదవవంతువరకు నెక్కును. ఈభాగమే ప్రాణవాయువుచే నాక్రమింపబడిన భాగము. అది స్ఫురముతో కలిసి తెల్లనిపొగయై, తరువాత నీటిలో కలసి పోవుటచే నాఖాలీస్థలమును నీరాక్రమించినది. మిగిలిననాలుగుభాగములును "నత్రజని". దీనిని చూపుటకు, గొట్టములో దీపమును బెట్టిన నదివెంటనే యారిపోవును.

మనము దీపమును జాగ్రతగా పరీక్షించిన, దానియందు ప్రకాశభేదముగల యనేకభాగము లుండును. అందు మొద

టిది, వత్తికిసమీపమున నల్లగా నుండును. రెండవది, దానికి పైన అన్నిటిలో కాంతిగల భాగముండును. దీనికిని పైన అంత కాంతిలేని మూడవభాగ ముండును. ఈమూడింటిలో మొదటిది మండుట కుపయోగించు బొగ్గు మొదలైనయణువులు గలిగి యుండును. రెండవ దానిలోని మండెడువస్తువులు ప్రాణవాయువుతో కొంతవరకు రసాయన సంయోగము జెందును. ఈ భాగమునందు సంయోగము జెందని యణువు లుండుటచేతనే నిది ప్రకాశమానముగా నుండును. మూడవదానియందు రసాయన సంయోగక్రియ పూర్తిగా జరుగుచుండును. అందుచేత యిది యంతగా కాంతి గలిగి యుండక, ఉష్ణోగ్రతయందు మాత్ర మన్నిటిలో మొదటిదిగా నుండును. ఈ భాగమునందు ఏవస్తువు నైన వేడిచేసిన నదిత్వరగా వేడెక్కును.



99 వ పటము.

99వ పటమునందు క్రొవ్వువత్తి దీపము జూపబడినది. దాని మొదటి భాగములో మండెడు వస్తువులు కూడియుండు ననిచూపుటకు,99 వ పటమునందు చూపినట్లుగా వంపబడిన గాజుగొట్టముయొక్క యొకచివరను ఆభాగములో పెట్టిన సందని మండెడు వాయువులు గొట్టముగుండా నావలికివచ్చును. అవి వచ్చుచున్నట్లురెండవ కొనయందు వెలిగించి చూపవచ్చును.

కొన్ని దీపములనుండి పొగ వెలువడుట మనకంటికే కన బడును. ఈ పొగయనునది రసాయనసంయోగము జెందక తప్పించుకొనిపోవు సూక్ష్మమైన బొగ్గుకణములే.

సాధారణముగా పొగకనబడని దీపములయందుండిగూడ బొగ్గుకణము లెగసిపోవు నని జూపవచ్చును. ఒక తెల్లని కాగితమును ఆదీపముమీద కాలకుండ బెట్టిన నది నల్లబడి మసి కూడినట్లు గనపడును.

ఇట్లే మండెడు పదార్థములయందు బొగ్గు కలిసియుండు నని గ్రహించవచ్చును. అట్లు పదార్థములను కాల్చిన నవి నల్ల బడును. నల్లబడుటనుబట్టి బొగ్గుగలదని మనము చెప్పవచ్చును. కాగితము, కఱ్ఱ, ఎండినఆకులు మొదలైనవి కాలినప్పుడు పొగవచ్చి నల్లబడును. హారతి కర్పూరము, కర్పూర తైలము మొదలైనవి గూడ కాలునప్పుడు పొగ యధికముగా వచ్చును.

తెల్లని పంచదారలోగూడ బొగ్గుగలదని చూపవచ్చును. కొంచెము పంచదారను తీసికొని దానిలో గంధకద్రావకమును వేసిన నది వెంటనే నల్లబడును. దీనినిబట్టి అందు బొగ్గు గలదని తెలియును. జను లుపయోగించు కూరగాయలును, మాంసాదులును, వేగినప్పుడు నల్లగానగును. వానిలోగూడ బొగ్గుగలదు. ఇంతయేల వృక్ష, జంతుకోటులయం దన్నిటిలోను బొగ్గు (కర్బనము) గలదు. ప్రాణముగల ప్రతిదానియందు కర్బనము గల దని శాస్త్రజ్ఞుల యభిప్రాయమై యున్నది.

పైన చూపబడిన నొక ప్రయోగములో ఇనుముకు గాలి సోకినప్పుడు త్రుప్పు పట్టును అని తెలిసికొంటిమి. త్రుప్పు అన నేమి? ఇనుము, ప్రాణవాయుతో కలిసినప్పుడు కలిగిన రసాయన సమ్మేళనము త్రుప్పుఅనబడును. దీనికి శాస్త్రీయనామము "లోహామ్లజనితము" అనగా లోహమును, ఆమ్లజనియు కలిసి పుట్టినదని యర్థము.

ఇనుపత్రుప్పు గౌరవర్ణము గలిగి, నీటిలో కలియక యుండును. ఈపదార్థము గాలిలో తేమయుండిననే కలుగును. తేమ అనేకమైన రసాయనసమ్మేళనములకు కారణభూతము.

ఇనుపత్రుప్పునకు విషపుగుణము లేమియు లేవు. ఇతర లోహములుగూడ గాలి సోకినప్పుడు తమప్రకాశమును పోగొట్టుకొని తగ్గిపోవును. ఇత్తెడి, కంచు మొదలగు లోహసమ్మేళనములు గూడ గాలి సోకినప్పుడు తగ్గును. అందువలననే అట్టిపాత్రలు తరుచుగా శుభ్రముచేయవలసి యుండును. రాగిపాత్రలను ప్రతిరోజును శుభ్రముగా తోమనియెడల వానిమీద (చిలుము అనబడు) నొకపచ్చనివస్తువుకన్పడును. ఇది రాగియు గాలిలోనుండు వస్తువులు కొన్నియు కలిసి కలిగినసమ్మేళనము. ఇదినోటికితాకిన విషప్రాయమై, వాంతులుపుట్టును. ప్రాణహాని కూడ కొన్నిసమయములయందు కలుగవచ్చును. కాబట్టి రాగిపాత్రముల నుపయోగించువారు నాటిని శుభ్రపరచుటయందు బహుజాగరూకులుగా నుండ[illegible]. ఎం[illegible] పాత్రము చిలుము న్నను ఆపాత్రను శుభ్రము[illegible]ను [illegible]గించగూడదు.

ఇట్టి చిలుము పట్టకుండుటకే రాగిపాత్రలకును ఇత్తడి పాత్రలకును, కళాయి చేయించునట్టి యాచారము గలదు. కళాయిసేయుట యనగా ఈపాత్రలకు తగరపుపూత నిచ్చుట. తగరము లోహములలో నొకటి. అది గాలిలో నంతగా చెడదు. అనగా త్రుప్పుపట్టదు. త్రుప్పు పట్టినను నది విషము గాదు. అందుచేతచిలుము లేకుండుటకై తగరముతోకళాయి చేయుదురు.

మన ముపయోగించు సీనారేకు, తగరపుపూత గల ఇనుపరేకుతప్ప వేరుగాదు. తగరము పోగానే, ఇనుము బయ ల్పడి త్రుప్పుపట్టుటకు ప్రారంభించును. తగరము పోనంతకాల ము ఇనుపరేకున కేమియు భయము లేదు. దీనినిబట్టి ఇనుప రేకును రక్షించుటకే ఈతగరము పూయబడినదని తెలియు చున్నది.

కొన్ని పనులకు తగరమునకు మారుగ "యశదము" (Zinc)ను పూయుదురు. అట్టిరేకులు ఇండ్లకప్పులుగా నుపయో గింపబడుట మన మనేకచోట్ల చూచుచున్నాము.

ఇదిగాక ఇనుమునకు పింగాణీ పూతకూడ పూయుచు న్నారు. పింగాణీ ఒకవిధమైన గాజుమట్టి. ఇది నీటితోగాని, గాలితోగాని, ఉప్పులతోగాని, ద్రావకములతోగాని కలవదు. అందుచేత నీపింగాణీపూత గల పాత్రవిశేషము లనేకములు ఉపయోగింపబడు చున్నవి. మన దేశమునందలి ఇత్తడి, రాగి, కంచు పరిశ్రమలను నిర్మూలము చేయుచున్న దీ పింగాణియే.

కొన్ని సమయములయందు, ఇనుప ఊచలకు, మరి ఇతర వస్తువులకు, తారు పూయుదురు. దీనియభిప్రాయము గూడ ఇనుమును త్రుప్పు పట్టకుండునట్లు చేయుటయే.

లోహ సమ్మేళనముల రచన:—

ఇత్తడి...రాగి, యశదము.

కంచు...రాగి, యశదము, తగరము.

మాయవెండి (జర్మనీ వెండి)—రాగి, యశదము, నికెల్; 2: 1: 1.

అణాకాసు ... ... ... రాగి, నికెల్, 3:1.

లోహము లన్నిటిలో వెండి బంగారుల కంతవెల యేల యుండవలెను? ఈరెండు లోహములును గాలిలోను, నీటిలోను మార్పుజెందక తమప్రకాశమును చాలకాల ముంచుకొనును. వెండివస్తువులు ఉప్పునీరు, ఉప్పుగాలితగిలినప్పుడే తగ్గిపోవును. అంతవరకు వానికాంతి చెడదు. బంగారుమీద నివియు పని చేయలేవు. ద్రావకములు గూడ దానిని మార్చలేవు. ఇదిగాక దానిరంగు మిక్కిలి రామణీయకముగా నుండును. తోమిన కొద్ది మెరుగువచ్చును. ఈ అన్ని కారణముల చేతను నీరెండు లోహములను అలంకారములను చేయుటయందును, నాణెములను చేయుటయందును ఉపయోగింతురు.

ఈరెంటి కంటెను "ప్లాటినము" అను లోహమునకు పైనుదహరించిన గుణము లధికముగా నుండుటచే, వీటికంటె నధిక వెల గలిగి యుండును.

---

# విజ్ఞానచంద్రికా గ్రంథమాల.

చింతాద్రిపేట మద్రాసు

ఈ 3 గ్రంథములను గవర్నమెంటువారు పఠనీయములుగానుంచుటకు సమ్మతి నిచ్చియున్నారు.
21-10-13. పేజీ 565 ఫోర్టు సెంటు జార్జిగెజటు.)

## 1. రాణీ సంయుక్త

జగద్విఖ్యాతమై, నాలుగు నాటకరచనలకు మార్గదర్శకమై, శైలియందును వర్ణనలయందును, కథా చమత్కారమునందును నిరుపమానమై పండితుల చేతను, పామరులచేతను, పొగడ్తగన్న ఈ అద్భుతనవలను గురించి ఎంతవ్రాసినను తనివిదీరదు. దీనింజదివి యిందలి స్వారస్యమును పాఠకు లే గ్రహింతురుగాక! గ్రంథకర్త. వేలాల-సుబ్బారావు. వెల 0_12_0 లు మాత్రమే.

## 2. హిందూమహాయుగము

ఇది 250 పుటల గొప్పచరిత్ర గ్రంథము. హిందూదేశ కథాసంగ్రహముయొక్క మొదటి భాగము. మనపూర్వుల రాజ్యవిస్తారంబును, అప్రతిమశౌర్యమును, అకలంక స్వదేశభక్తియు, తెలిసికొనగోరు వారీగ్రంథమును తప్పక చదువవలయును. అత్యంత పురాతనకాలమునుండి మహమ్మదీయులదండ యాత్రవరకు గల చరిత్రమంతయు సవిస్తరముగా వర్ణింపఁబడినది.

బుద్ధ, అశోక, కనిష్క, కాళిదాస, శ్రీహర్ష, చంద్రగుప్త, భవభూతి నన్నయ్య, తిక్కన మొదలయిన పవిత్ర జీవితములు శ్రద్ధతో వ్రాయఁబడినవి.

ఇది యింతవరకు ఐదుకూర్పులుపడి యెంతో జనసమ్మతమును వడసియున్నది. ఇట్టిది తెలుఁగులో లేదు. అనేక పరీక్షలకును, పాఠశాలలయందును పఠనీయముగ నియమించియున్నారు. నియమించుచున్నారు.

గ్రంథకర్త. కే. వి. లక్ష్మణరావు, ఎం. ఏ. వెల రు. 1_0_0 మాత్రమే.

## 3. పదార్థవిజ్ఞానశాస్త్రము

దీనినింగ్లీషులో ఫిజిక్సు అనెదరు. ఇది గొప్పశాస్త్రీయ గ్రంథము. ఇందనేక యపూర్వవిషయములు వర్ణించఁబడినవి. పాఠశాలలోని 1, 2, 3 ఫారములకును ట్రైనింగుస్కూళ్ళకును అనుకూలముగ నుండునట్లు వ్రాయబడినది. వెల 0_12_0 లు. గ్రంథకర్త. ఎం. సాంబశివరావు, బి. ఏ. ఎల్. టి.

# మా వద్ద దొరకును

## ఏమిటి?

విజ్ఞానచంద్రికాగ్రంథములు
ఆంధ్రభాషాభివర్ధనీప్రచురములు
ఆంధ్రప్రచారిణీ నవలలు
వావిళ్ల రామస్వామిశాస్త్రులు&సన్సు వారిగ్రంథములు.
ఆర్. వేంకటేశ్వర& కో గ్రంథములు
ఆనందాప్రెస్సువారి భారతభాగవతరామాయణములు
విస్మృతకవులసీరీసు
సువర్ణలేఖాగ్రంథమంజరి.
పానుగంటి నరసింహారావుగారి నాటకములు
చిలకమర్తి లక్ష్మీనరసింహముగారి గ్రంథములు
వే. వేంకట్రాయశాస్త్రులవారి గ్రంథములు

ఇంతయేల?

సంస్కృతగ్రంథములు, పద్యప్రబంధములు, వచనకావ్యములు, నాటకములు, నవలలు, కథలు, వింతలు, వినోదములు

వగయిరా! వగయిరా!! వగయిరా!!!

మా వద్ద దొరకును.

చిరునామా:—

విజ్ఞానచంద్రికా బుక్కుడిపో
చింతాద్రిపేట—మద్రాసు.